# విజ్ఞప్తి

ఇందలి సూత్రగ్రంథములను, అనుబంధమును రచించిన మహాకవియగు కావ్యకంఠ శ్రీ వాసిష్ఠగణపతిముని యాంధ్రుడు. పండితప్రవరుడు, తపస్స్వరూపుడు, సిద్ధకవియైన యీ మహాపురుషుని రచనములు పూర్వఋషిప్రోక్తములవలె పరావాక్ప్రేరితములు. ఆధునికులలో సూత్రరచనమును జేసిన కవి యీత డొక్కడే యని నిష్కర్షగా చెప్పగలము. అంతేగాక, మఱ్ఱుపడి పండితుల కలవిగాక యున్న మంత్రతంత్రాదిరహస్యములను భేదించి, వేద–శాస్త్రేతిహాసములయం దట్టి రహస్యములను సూచించు కథలకు గల లక్షణార్థములను తగువిధమున నన్వయించి, యింతవఱకు వానిని గుఱించి పండితులందును వ్యాపించిన యల్పదృష్టిని నివారించిన ధీరు డితడు. ఆంధ్రుల పుణ్యఫలముగా వెలసిన యీ గణపతిరూపము క్రీ. శ. 1878–1936 వఱకు భువి నలంకరించెను.

నే నీ మహనీయుని చరిత్రమును తెనుగున రచించి, దానికి ‘నాయన’ యను పేరిడి, విళంబిసంవత్సరాదికి సరియగు తే21–3–1958దీ నాడు వెలువరించి, దాని విక్రయమువలన వచ్చులాభముతో శ్రీ గణపతిముని విరచిత గ్రంథప్రకాశనము జేయదలచియుండగా, వానిపై గల సర్వస్వామ్యములు శిరసిపురనివాసియు, ‘నాయన’కు ప్రీతిభాజనుడు అయిన శ్రీ డి. యస్. విశ్వామిత్ర (వకీలు) గారికి సంక్రమించినట్లు తెలిసినది. వెంటనే నేను ప్రచురణానుమతిని వేడుచు వారికి తే 8–4–58 దీని వ్రాయుట తడవుగా, గురుభక్తిత్యాగాదిసుగుణములతో పరిమళించు జవాబును తే 14–4–58 దీని వా రంగీకారపూర్వకముగా వ్రాసి, తే 8–5–58 దీ గల లేఖద్వారమున తదనుమతిని ధృవపరచిరి. తత్ఫలముగా నచ్చొత్తించబడిన స్వల్ప సంపుటియే యీ ‘మహావిద్యాది సూత్రావళి’.

ఈ సంపుటిలో ప్రథమభాగమున తంత్రశాస్త్రసారభూతము లగు కాళీ, తారా, త్రిపురసుందరీ మొదలుగాగల దశమహావిద్యల యొక్క తత్త్వములను వివరించు సూత్రగ్రంథము, ద్వితీయభాగమున మఱికొన్ని తత్త్వయోగావతారాది వ్యాఖ్యానసూత్రగ్రంథములు ముద్రింపబడియె. వీని కనుబంధముగా రుద్ర–విష్ణు–శక్తి–పంచభూత–సప్తధాత్వాదిపరములుగా తంత్రశాస్త్రకోవిదు లుపయోగించిన వివిధ నామములయొక్క సంజ్ఞబీజాక్షరములను సూచించుటకు 21 శ్లోకములచే గణపతిముని రచించిన 'అక్షరావళి' యను గ్రంథము మంత్రోపాసకులకు దోడ్పడుటకై ముద్రింపబడెను. వీని కన్నింటికి తెలుగు తాత్పర్యములను నా శక్తికొలది సమకూర్చి ముద్రింపించితిని గావున నందలి గుణదోషములను నావిగా భావింప ప్రార్థింతును.

ఏతత్సంపుటి వెలువడుట కనుమతి నొసగి తోడ్పడిన శ్రీ డి. యస్. విశ్వామిత్రగారికిని, యిందలి మూలములను నేను వ్రాసికొనుటకు శిరసిగ్రామము పోనక్కఱలేకుండ వానిప్రతులను నా కిచ్చి సహాయపడిన శ్రీ కె. నటేశఅయ్యరుగారికిని నా కృతజ్ఞతాభివందనము లర్పింతును. అట్లే ముద్రణమును దోషములు లేకుండ శీఘ్రకాలములో ముగించి యిచ్చిన 'ది జ్యూపిటర్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్,' వారికిని నా కృతజ్ఞతాపూర్వకములగు వందనములు. ఈ ప్రచురణకార్యము సానుకూలమగుటకు దోహదమొనర్చి నావంతు శ్రమబూనిన కనిష్ఠసోదరప్రాయుడగు జే. జి. కే. మూర్తిపై భగవదనుగ్రహ మాయురారోగ్యాదిసంపదల నెల్లప్పుడు సమకూర్చుచు సాకుగాక.

యలమంచిలి,<br>శ్రీ విళంబి సం॥<br>3–12–1958<br>(గణపతిముని జన్మదినము)

ఇట్లు,<br>శ్రీ గణపతిముని సేవాభిలాషి<br>గుంటూరు లక్ష్మీకాంతము.

# మహా విద్యాది సూత్రావళి

## ప్రథమ భాగము

### దశ మహా విద్యలు

1. కాళీ పటలము
2. తారా పటలము
3. సుందరీ పటలము
4. భువనేశ్వరీ పటలము
5. భైరవీ పటలము
6. ప్రచండచండికా పటలము
7. ధూమావతీ పటలము
8. బగళాముఖీ పటలము
9. మాతంగీ పటలము
10. కమలాత్మికా పటలము

శ్రీం

# దశమహావిద్యాః



## ప్రథమః కాలీ పటలః

1. కాలీం వ్యాఖ్యాస్యామః ।
2. ఆద్యా సా దశసు మహావిద్యాసు ।
3. క్రియాశక్తిః కాలీ మధ్యమాత్వాధిదైవతమ్ ।

4. సర్వవ్యాపినీ ।
5. విద్యుచ్ఛక్తే ర్నాతిరిచ్యతే ।
6. సర్వాణి భూతాని పచత్యజస్రమేషా ।
7. పాక ఏవ శాస్త్రేషు వ్యవహ్రియమాణః పరిణామః ।

8. పాచకత్వమేవ కాలస్య స్వరూపమ్ ।
9. కాల ఏవ స్త్రీలింగేన కాల్యుచ్యతే ।
10. అభూదనయా బహూనాం అండానాం సంహారః ।

11. తస్యాః కంఠే అస్మాభిః చింత్యమానా ముండమాలా తదేతదండ సంహారవైభవం స్మారయితుం ।
12. నిత్యసంగ్రామకారిణీతి పిశాచికేవ భీమరూపా వర్ణ్యత ఇయం పరిణమయిత్రీ శక్తిః ।

శ్రీ

# దశమహావిద్యలు



## 1. కాళీ పటలము

1. కాళిని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో మొదటిది.
3. క్రియాశక్తియగు కాళీ విద్య కధిదైవతము 'మధ్యమ' (గౌరి). (భువనముల కావల కేవలమైయుండు శక్తీశ్వరు లుత్తములనియు, భువనకారణత్వమును వహించి భువనాధిష్ఠానులైనపుడు మధ్యములనియు వ్యవహారము. దండనాథ యొకవైపు, మంత్రిణి యొకవైపునున్న కారణమువల్లను మధ్యమయగును.)
4. కాళియను శక్తి సర్వవ్యాపిని.
5. విద్యుచ్ఛక్తికంటె వేఱుకాదు.
6. ఈమె సర్వభూతముల ననునిత్యము పచన మొనర్చుచుండును.
7. పాకమే (పచనక్రియయే) శాస్త్రములందు పరిణామముగా వ్యవహరింపబడెను.
8. పాచకత్వమే కాలముయొక్క స్వరూపము.
9. స్త్రీలింగవచనముచే కాలమును కాలి (కాళి) యనిరి.
10. అట్టి యీమెచే ననేక అండరూపములు సంహరింపబడెను. (పిండాండ, అండాండ, బ్రహ్మాండములు మూడింటికి నన్వయించును).
11. ఆ యండ సంహారమును స్మరింపజేయుటకే మనమామె కంఠమందు ముండమాల నూహింతుము.
12. పరిణామకారిణియైన యీ శక్తి నిత్యసంగ్రామ కారిణియని భయంకర పిశాచి రూపముగా వర్ణింపబడెను.

13. అతఏవ వామైవ విభుతేత్యాహ పుష్పదంతః ।

14. మహాకాలస్య నిత్యతాండవస్య విభుతాతః కాలీనాతిరిచ్యతే ।
15. క్రియైవ తాండవ ముచ్యతే ।
16. పరిణమయిత్రీ శక్తి ర్నకేవలం సంహరతి ।
17. సృజత్యపి ।
18. పూర్వపూర్వావస్థా సంహార ఏవోత్తరోత్తరావస్థా సర్గో భూతానాం ।
19. ఏకైవక్రియా ద్వ్యర్థకరీత్యుక్తం భవతి ।
20. ఏతేన కాలస్య కారణత్వం వ్యాఖ్యాతం ।

21. 'అహమేవ వాత ఇవ ప్రవామ్యారభమాణా భువనాని విశ్వే'తి మన్త్రవర్ణోఽత్ర భవతి ।

22. ఈశస్య పరమకారణత్వం తద్వత్త్వాత్ ।
23. ఏషా పరిణమయిత్రీ సమష్టిశక్తి ర్భూతాన్యావిశ్య వ్యష్టిశక్తిశ్చ భవతి ।
24. తత్ర తారతమ్యముపాధిభేదా త్తేజస ఇవ సూర్యాదౌ ।

25. భూతాన్తరాపేక్షయా చేతనానాం తచ్ఛక్తి వాహీస్వభావో భూయాన్ ।

26. అస్మాసు ప్రవహన్తీ సాశక్తిః కుండలిన్యుచ్యతే ।

27. సాహి శ్రేష్ఠం ప్రాణమావిశ్య క్రియాశక్తిర్భవతి పురః ।

13. అందువల్లనే పుష్పదంతుడనుకవి (వామయే) స్త్రీయే సృష్టికి విభుత యనెను. (ఇంకొక అర్థము.—పుష్పదంతు డీమె విభుత్వమును వామము—అనగా వక్రమనెను.)
14. మహాకాలుని (యీశ్వరుని) నిత్యతాండవ వైభవముకంటె కాళి
15. క్రియయే తాండవ మనబడెను. [వేఱుకాదు.
16. పరిణామములను గల్పించుశక్తి కేవల సంహారమే చేయదు.
17. సృష్టిని కూడ చేయును.
18. భూతములయందు పూర్వావస్థలయొక్క సంహార ముత్తరావస్థల సృష్టికొఱ కగుచుండును.
19. ఒకే క్రియ యీ విధముగా రెండుపనుల కొఱకగును.
20. ఇందుమూలముగా కాలము (కాళి) యొక్క సృష్టికారణత్వము వ్యాఖ్యాత మయ్యెను.
21. 'నేనే భువనసృష్టి నారంభించుటకు వాయువువలె సర్వత్ర ప్రవహింతు' నను నర్థముగల వేదమంత్ర మిక్కడ గ్రహింపదగినది.
22. అట్టి వైభవమువల్లనే యీశ్వరునకు పరమకారణత్వమొప్పును.
23. పరిణామ కారిణియైన యీ సమష్టిశక్తి భూతముల నావేశించుటచే వ్యష్టిశక్తియు నగుచున్నది. (వికృతి పరిణామముకొఱకు).
24. సమష్టి వ్యష్టులయందు శక్తికిగల తారతమ్య ముపాధి ననుసరించి సూర్యచంద్రాదుల నావేశించిన తేజస్సున కున్నట్లుండును.
25. ప్రాణజాతమందీశక్తి భూతాంతర్యమునపేక్షించి హెచ్చుప్రవాహస్వభావముగలదియగును. (అనగా నాంతర్యమున సూక్ష్మముగానుండు నాకాశమును లేదా ప్రాణమనోబుద్ధుల నపేక్షించి).
26. మనయందు ప్రవహించునట్టి యంతశ్శక్తియే 'కుండలిని' యనబడుచున్నది.
27. ఆమెయే పురమనెడి దేహమందు శ్రేష్ఠమైనది యగు ప్రాణము నావేశించి క్రియాశక్తి యగును.

28. శ్రేష్ఠే శక్త్యాంచ ప్రాణవ్యవహారః ఉపనిషత్సు దృశ్యతే।

29. ఇంద్రియసహస్రాతే శ్రేష్ఠపరః।

30. పరత్వేన స్తుతౌ శక్తిపరః।

31. ప్రాణతరంగా ఏవోచ్ఛ్వాసాదయో న ప్రాణస్వరూపమ్।

32. న వాయు, క్రియే పృథగుపదేశాదితి బాదరాయణస్య సూత్రమత్ర భవతి।

33. సంసారిణాం ప్రాణశక్తిః ప్రతిక్షణం వినియోగవైషమ్యేణ క్షీయతే।

34. ముహుర్ముహుః శ్వాసవిసర్గాచ్చ।

35. ఆత్మశక్తే ర్వృద్ధయే కాలీముపాసీత।

36. రసజ్ఞయా।

37. జ్ఞానతః శ్వసనం తస్యాః శుద్ధముపాసనమ్।

38. జ్ఞాయమానా క్రియా మహామహిమాస్యాత్।

39. మనసే శక్తిం దద్యాత్।

40. వాచే శక్తిం దద్యాత్।

41. చక్షుషే శక్తిం దద్యాత్।

42. అంతతో దీర్ఘజీవితంచ దద్యాత్।

43. ముక్తయే చైషా విద్యా భవతి।

28. ప్రాణమునకు శ్రేష్ఠపరముగను శక్తిపరముగనుకూడ వ్యవహార మపనిషత్తులం దగపడును. (అనగా శ్రేష్ఠప్రాణమని శ్రేష్ఠ పరముగను, ప్రాణశక్తియని శక్తిపరముగను కేవలప్రాణమును బిలుతురు).
29. ఇంద్రియములతో గూడినప్పుడు శ్రేష్ఠపరముగా (అనగా శ్రేష్ఠ ప్రాణమని) వ్యవహరింపబడెను.
30. పరమమైనదిగా స్తుతింపబడుటయందు (ప్రాణశక్తియని) శక్తి పర ముగా వ్యవహరింపబడెను.
31. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ప్రాణతరంగములే యగును కాని ప్రాణస్వరూపము కాజాలవు.
32. వాయువు, క్రియయుకూడ (ప్రాణస్వరూపము) కాజాలవని ప్రత్యేక ప్రత్యేకముగా నుపదేశింపబడిన విషయము బాద రాయణసూత్రములం దున్నది.
33. సంసారులయొక్క ప్రాణశక్తి ప్రతిక్షణము వినియోగమగుచు గతి వైషమ్యముచే క్షీణించుచున్నది.
34. మాటిమాటికి శ్వాసను పీల్చుట విడుచుటద్వారా (అట్లగు చున్నది).
35. (కనుక) ఆత్మశక్తి వృద్ధియగుటకు కాళి నుపాసించవలెను.
36. రసజ్ఞా బీజముచే ('క్రీం' అను కాళీబీజము రసజ్ఞాబీజ మనబడును. ఇది మనుత్రయములో నొకటియై యొక మంత్రమగును).
37. శ్వసితకర్మను గమనించువాని కామెయొక్క శుద్ధోపాసన మగును.
38. అట్లు తెలియుచు చేయబడిన క్రియ మహామహిమగలదియగును.
39. అది మనస్సునకు శక్తి నిచ్చును.
40. వాక్కునకు శక్తి నిచ్చును.
41. కంటికి శక్తి నిచ్చును.
42. తుదకు దీర్ఘజీవితమును గూడ నిచ్చును.
43. ఈ విద్య మోక్షమును సైత మీయగలదు.

44. ఇయం సంవర్గవిద్యోపనిషత్సు గీయతే ।
45. ప్రాణవిద్యా కైశ్చిత్ ।
46. ముఖ్యప్రాణోద్గీథవిద్యా పరైః ।
47. సంసారిణః ప్రహరత్ఖడ్గం కాలీ ।

48. యోగినాం హస్తగతం ఖడ్గం ।

---

## ద్వితీయః తారా పటలః

1. తారాం వ్యాఖ్యాస్యామః ।
2. ద్వితీయా సా దశసు మహావిద్యాసు ।
3. శబ్దశక్తిస్తారా మధ్యమాత్వాధిదైవతమ్ ।
4. శబ్దశక్తిశ్చ ప్రణవా న్నాతిరిచ్యతే ।
5. తాం పశ్యంతీ మాహుః ।

6. తార ఇతి ప్రణవస్య ప్రసిద్ధం నామ ।
7. తార ఏవ స్త్రీలింగేన తారోచ్యతే ।
8. ఇయం నాకాశస్య ।

9. అపి త్వాకాశే చరతి ।
10. ఓంకారస్తు తదనుకరణమాత్రమ్ ।
11. న స్వరూపం ।
12. ఖండత్వాత్ ।

44. ఉపనిషత్తులు దీనినే సంవర్గవిద్యయని గానముచేసెను.

45. దీనిని కొందఱు ప్రాణవిద్యయనిరి.

46. మఱికొందఱు 'ముఖ్య ప్రాణోద్గీథ విద్య' యనిరి.

47. సంసారుల జీవితమందు బ్రహారణములనొనర్చు ఖడ్గమువలె కాళి యొప్పును. (పరిణామమందు వీరు విభేదములను జూతురు గనుక)

48. యోగులయందైనచో హస్తమునకు స్వాధీనమైన ఖడ్గమువలె (విజయములను గూర్చునదిగా) నుండును.

---

## 2. తారా పటలము

1. తారను గుఱించి వ్యాఖ్యానించెదము.

2. ఆమె దశమహావిద్యలలో రెండవది.

3. శబ్దశక్తియగు తారా విద్య కధిదైవతము 'మధ్యమ' (గౌరి).

4. శబ్దశక్తి ప్రణవముకంటె వేఱుకాదు.

5. దానిని 'పశ్యంతీ' యందురు. (పరా – పశ్యంతీ – మధ్యమా – వైఖరీ యను నాల్గు విధములగు వాక్కులలో రెండవదానిని కల్పించు శబ్ద శక్తి యని భావము).

6. 'తార' యనునది ప్రణవముయొక్క ప్రసిద్ధనామము.

7. తరింపజేయునదియై స్త్రీలింగముచే 'తారా' యనబడెను.

8. ఇది యాకాశసంబంధముకాదు (అనగా నాకాశమునకు గుణమగు శబ్దమునిచ్చు సగుణశక్తి కాదు). [రూపిణి.

9. మఱియెట్టిదనిన, ఆకాశమందు కేవలము సంచరించునట్టి శబ్ద

10. 'ఓం' కార మామె కనుకరణమాత్రము.

11. స్వరూపము కాజాలదు. [భూతమైనది).

12. ఖండత్వము జెందుటవలన (వాచ్యమైన 'ఓం' కారము ఖండీ

13. ప్రణవోహ్యాఖండః ।
14. తారైవ నీలోచ్యతే తామసీతి।
15. తామసత్వం చాత్రావ్యక్తత్వమ్ ।

16. ఏతేన రుద్రస్య తామసత్వంచ వ్యాఖ్యాతమ్।

17. పావనేభ్యశ్చ పావనీ భవత్యేషా ।
18. యదియమీశ్వరస్యాసాధారణం నామ।
19. 'తస్య వాచకః ప్రణవ' ఇతి పతంజలి రత్రభవతి ।

20. తదనభిజ్ఞస్య సర్వేమంత్రా వ్యర్థాః ।

21. 'ఋచోఽక్షరే పరమే వ్యోమ' న్నితి మన్త్రే య స్తన్నవేద కిమృచా కరిష్యతీతి పాదోఽత్ర భవతి ।

22. ఇయం వ్యక్తశబ్దానావిశ్య వ్యష్టిశక్తిశ్చ భవతి।
23. ప్రణవ వాహిత్వే శబ్దేషు తారతమ్యం ।

24. ధ్వనిభ్యో వర్ణేష్వధికత్వం ।

25. తత్రాపి వైదిక పదఘటితేషు।
26. తదనుగత సురవశ్రేణీ సమర్పిత నాదవిశేషతః ప్రణవాభి వ్యక్తిః ।
27. ఏతేన మన్త్రస్వర రక్షాప్రయోజనం వ్యాఖ్యాతమ్ ।

13. ప్రణవమో యఖండమైనది.
14. తామసవర్ణమై తారయే 'నీల' యనబడుచున్నది.
15. ఇక్కడ తామసత్వ మవ్యక్తత్వమునకు (లేదా గుణప్రకాశము గానట్టి శబ్దస్థితికి) అర్థము.
16. ఇట్లే ప్రణవస్వరూపుడైన రుద్రునియొక్క తామసత్వముకూడ వ్యాఖ్యానింపబడినదగును.
17. ప్రణవమనబడు నీ తార పావనమైనవానికంటెను పావనము.
18. ఇది (అనగా ప్రణవము) యీశ్వరుని యసాధారణ నామము.
19. 'ఈశ్వరవాచకము ప్రణవ' మని పతంజలి పేర్కొనిన దిక్కడ ఒప్పును.
20. ఆ ప్రణవస్వరూపము నెఱుగని వారికన్ని మంత్రములు వ్యర్థములే. (మంత్రధ్యానము చేయునప్పుడు మంత్రనాదము దాని మూలమగు ప్రణవమునందు లీనమగువఱకు జపించి ప్రణవము నెఱుగవలెను. అదియే సిద్ధి, యదియే జపసార్థకము).
21. 'ఋచోఽక్షరే పరమే వ్యోమన్' అను మంత్రములోని యీ విషయ మెవ్వరెఱుగరో వారికీ ఋక్కువలన నేమి ప్రయోజనము? అనునదిక్కడ తట్టును.
22. ఈ తార వ్యక్తశబ్దము నావేశించి వ్యష్టిశక్తియు నగుచున్నది.
23. ప్రణవముయొక్క యుపాధిననుసరించి శబ్దములందు తారతమ్య మేర్పడును.
24. సామాన్యధ్వనులయందుకంటె వర్ణములందు ప్రణవప్రవాహ మధికము.
25. ఆ వర్ణములందైనను వైదికపదబద్ధములందింకను నధికము.
26. వేదపదానుగతములగు సుస్వరములయొక్క శ్రేణులకు సమర్పితమైన నాదవిశేషమువలన ప్రణవము పరిస్ఫుటమగును.
27. దీనినిబట్టి వేదమంత్రస్వరమును గాపాడు ప్రయోజనము వ్యాఖ్యాతమైనది.

28. మంత్రాణాం భాషాంతరీకరణే గూఢార్థసమర్పణమేవ ప్రయోజనం।

29. న జపోపయోగిత్వమ్।

30. అస్ఫుట ప్రణవత్వాత్।

31. ఋషీణాం తపసి ప్రణవసముద్రా న్నిర్గతాస్తరంగా మన్త్రాః।

32. తత్రర్షీణాం వాక్ జలస్యకుల్యేవ ప్రవహణ భూః।

33. పురుషయత్న గ్రథితా లౌకికాః శబ్దాః।

34. సత్యామపి స్ఫుటప్రణవశబ్దగ్రథనే నాస్తి పురుషస్యశక్తిః।

35. యథా సత్యామపి భూతసామగ్ర్యాం శిల్పినో న ప్రాణినిర్మాణ శక్తిః।

36. అధిభూత మధ్యాత్మంచ వాగేవ తారా।

37. సత్యా సమష్టివాక్।

38. వ్యాఖ్యాతం నీలాత్వం తస్యాః।

39. సైవ ఋషివాక్కుల్యాద్వారా వ్యక్తా త్రయీ।

40. తాం శుక్లామాహుః।

41. ఇత్యధిభూతమ్।

42. అథాధ్యాత్మమ్।

43. సత్యాసత్యా లౌకికీ వాక్చిత్రా।

44. మహజ్జిగమిషుణా తిసృష్వేకోపాస్యా।

28. మంత్రములను భాషాంతరీకరణ మొనర్చినచో గూఢములైన అర్థ సమర్పణము మాత్రమే ప్రయోజనమగును.
29. జపమున కా భాషాంతరీకరణము లుపయోగపడవు.
30. ఎందుచేతననగా ప్రణవము స్ఫుటము గాకుండుటవలన.
31. ఋషుల తపస్సులో దర్శనమైన మంత్రములు ప్రణవసముద్రము నుండి వెడలిన తరంగములే.
32. కాలువ జలప్రవాహమునకు హేతువగునట్లే ఋషులవాక్కు మంత్రప్రవాహమునకు హేతువయ్యెను.
33. పురుషప్రయత్నముచే కూర్పబడినవి లౌకిక శబ్దరూపములు.
34. అట్టి శబ్దములను గూర్చుశక్తి పురుషునియందున్నను స్ఫుటప్రణవ గ్రథనశక్తిమాత్రము లేదు.
35. ఏవిధముగా భూతసామగ్రిని కూర్చుశక్తి శిల్పియందున్నను ప్రాణి నిర్మాణశక్తి యుండదో.
36. అధిభూతమధ్యాత్మముల రెండింటియందును వాక్కే తార [యగును.
37. సమష్టి వాక్కే యామె యెల్లప్పుడు నున్నది.
38. అట్టి సమష్టివాక్కే యవ్యక్తముగానున్న ఆమెకు నీలాత్వమిది వఱకు చెప్పబడెను.
39. ఆమెయే ఋషివాక్కులనెడి కాల్వలద్వారా వేదత్రయియగుచు వ్యక్తమయ్యెను.
40. అట్టి వేదత్రయీ రూపిణియగు తారను 'శుక్ల' యందురు.
41. ఇట్లధిభూతమందు వాక్కు ప్రకటితమగుచున్నది.
42. ఇంక నధ్యాత్మమం దెట్లనగా.
43. లోకసంబంధమై, సత్యాసత్యమిశ్రితమై వాక్కు ప్రకటితమగుచు 'చిత్రా' యనబడుచున్నది.
44. మహాత్తును జయించగోరువాడు అధ్యాత్మాధిభౌతికాధి దైవత ములగు చిత్రా – శుక్లా – నీలా రూపములు మూడింటిలో నొకదానిచే తార నుపాసించవలెను.

45. తారాయా ఏవ శుక్లాచిత్రోపాసనమితి ।
46. తారాయాహీమే విభూతీ ।
47. ప్రణవ, మాయా, శ్రీ, కూర్చాస్త్రైస్తారా ముపాసీత ।
48. మాయా, శ్రీ, కూర్చాస్త్రైర్వా ।
49. మాయా, శ్రీ, కూర్చైర్వా ।
50. శుద్ధేన ప్రణవేన వా ।
51. ఉపాసనంతు తస్యా అంతరవ్యక్తేశబ్దే స్థితిః ।
52. మనసా మన్త్రానుసంధానా దవ్యక్తశబ్ద నిష్ఠా ।
53. అనుజ్ఞా ముద్రయా వా ।

54. ఇయ మక్షరవిద్యోపనిషత్సు గీయతే ।
55. ఉద్గీథ విద్యా కైశ్చిత్ ।
56. నానృతం వక్తవ్యమ్ ।
57. సత్యమేవ వక్తవ్యమ్ ।
58. స్వాధ్యాయోఽధ్యేతవ్యః ।
59. ఏతత్సమాసతః శుక్లాయా ఉపాసనం ।
60. చిత్రోపాస్యా పరముఖవిహారిణీ ।
61. నిందాయాం స్తుతౌచ
62. అసంబద్ధ ప్రలాపేషు కావ్యేషుచ
63. అపస్వరే సుస్వరే చ
64. రోదనే గానే చ
65. తుల్యం నాదం గృహ్ణీయాత్

45. శుక్లా, చిత్రోపాసనలుగూడ నీలమైన తారోపాసనములే.
46. అవి తారయొక్క విభూతులు.
47. తారను 'ఓం హ్రీం స్త్రీం హూం ఫట్' అను మంత్రముచే నుపాసించవలెను.
48. లేదా 'హ్రీం స్త్రీం హూం ఫట్' అని ప్రణవమును విడచి యైనను
49. లేదా 'హ్రీం స్త్రీం హూం' అని యస్త్రబీజమునుగూడ విడచి యైనను (ఇది బాలామంత్రముతో సమానమనబడును.)
50. లేదా 'ఓం' అను నొక్క ప్రణవబీజముచేనైన నుపాసించవలెను.
51. ఈ మంత్రాక్షరముల యంతరమం దవ్యక్తమైయుండు శబ్దమందు దృష్టినుంచి జపించుట యుపాసనక్రమము.
52. మనస్సుతో మంత్రము (అనగా శబ్దబీజముల) ననుసంధాన మొనర్చుటవలన నవ్యక్తశబ్దనిష్ఠ యేర్పడును.
53. లేదా అనుజ్ఞాముద్రచే నైనను నిష్ఠకల్గును. (ఒక రేదైన నడిగి నప్పుడు అనుజ్ఞనిచ్చుట కక్షరరూపముగా వ్యక్తముగాని శబ్దమును జేయుదురు. మంత్రజపమం దట్టి శబ్దమునందు దృష్టిచే)
54. అవ్యక్త నిష్ఠనే యక్షరవిద్యయని యుపనిషత్తులు గానముచేసెను.
55. దీనిని యుద్గీథవిద్యయని కొందఱనిరి.
56. అనృతమాడరాదు.
57. సత్యమునే పల్కవలెను.
58. వేదాధ్యయనము చేయవలెను.
59. పై మూడింటితో గూడినది శుక్లయొక్క ఉపాసనము.
60. చిత్రోపాసన మితరులవాక్కులందు విహరించునట్టిది. (ఎట్లనగా),
61. నిందాస్తుతులందు (రెండింటియందును),
62. అసంబంధ ప్రలాపములందు లేదా కావ్యాలాపములందు,
63. అపస్వర సుస్వరములందు,
64. రోదన గానములందు,
65. తుల్యమైన నాదమును గ్రహించుచుండవలెను.

66. న పరాఙ్ముఖో భవేత్ ।
67 నచాభిముఖః ।
68. ఏతచ్ఛిత్రాయా ఉపాసనమ్ ।
69. జిహ్వారసస్య సరస్వోపకల్పనాత్ తత్సంగిన్యాః సరస్వతీతి నామ।

---

## తృతీయః సుందరీ పటలః

1. సుందరీం వ్యాఖ్యాస్యామః ।
2. తృతీయా సా దశసు మహావిద్యాసు ।
3. సుందర్యేవ త్రిపురసుందరీ ।
4. జ్ఞానశక్తిః సుందరీ మధ్యమాత్వాధిదైవతమ్ ।
5. శబ్దశక్త్యా జ్ఞానచ్ఛాయాశ్లేషః ।
6. అతో జ్ఞానశక్తిరివ సాపి ।
7. తస్మాన్నాతిప్రసంగః ।
8. ధర్మిణో జ్ఞానస్య ధర్మో జ్ఞానమియమిత్యేకే ।
9. దీపప్రభయోస్తేజస్త్వమివోభయోర్జ్ఞానత్వం ।
10. సుతరామభేద ఇత్యన్యే ।
11. అధిష్ఠానత్వేన వ్యవహారే తదేవధర్మి ।
12. శక్తిత్వేన ధర్మః ।
13. 'రాహోఃశిర ఇతివద్భేదవ్యవహారః ।

66. పరాఙ్ముఖుడు కాగూడదు (అనగా నసహ్యించుకొనరాదు).
67. అభిముఖుడును (అనగా ప్రీతిగలవాడును) కాగూడదు.
68. అట్టి సమత్వ సాధనము చిత్రోపాసనము.
69. జిహ్వారసములయొక్క కలయికచే సరస్సు నుపకల్పన చేయు నట్టి శక్తి గావున 'సరస్వతీ' యను పేరీమెకు గల్గెను.

---

# 3. సుందరీ పటలము

1. సుందరిని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో మూడవది.
3. సుందరియే త్రిపురసుందరి యనబడును.
4. జ్ఞానశక్తియగు సుందరీ విద్య కధిదైవతము 'మధ్యమ'. (గౌరి).
5. శబ్దశక్తిలో జ్ఞానకళ మిళితమై యున్నది.
6. కనుకనే జ్ఞానశక్తివలె శబ్దశక్తి యుండెను.
7. దీనిని గుఱించి విశేషముగా ప్రసంగించ నక్కరలేదు.
8. ప్రజ్ఞానస్వరూపుడైన ధర్మియొక్క ధర్మమైన జ్ఞానమే సుందరి యని కొందఱనిరి.
9. దీపమునకు ప్రభకుగూడ స్వరూపము జ్యోతియే యగునట్లు ధర్మి ధర్మములకుభయులకు జ్ఞానత్వమొప్పును.
10. ధర్మిధర్మములకు భేదమేమాత్రము లేదని మఱికొందఱనిరి.
11. ఒకేజ్ఞాన మధిష్ఠానత్వము బొందిన వ్యవహారముచే ధర్మి యగు నని యు.
12. శక్తిత్వ వ్యవహారముచే ధర్మమగుననియు,
13. భేదవ్యవహారము 'రాహువుయొక్క శిర'స్సను సామెతను బోలి యుండునని చెప్పబడుచున్నది. (శిరస్సు రాహువు, మొండెము కేతువు అయినట్లు కథయున్నది. దీనినిబట్టి రాహువు యొక్క శిరస్సనుటలో అభేదము భేదమువలె తోచును)

14. అంతరశాఖాభేదేనేతి వాసిష్ఠః।

15. అస్యాః సంవిదోఽధ్యాత్మం ప్రథమంపురం చక్షుర్జాగరిత స్థానమ్।
16. 'ఫాలస్థేంద్ర ధనుఃప్రభే'తి నామనీ అత్ర భవతః।
17. ద్వితీయం శిర స్తైజసస్థానమ్।
18. విశుద్ధ చక్ర మిత్యేకే।

19. శంఖిన్యుభయ సంబద్ధేతి వాసిష్ఠః।

20. 'శిరస్థితా చంద్రనిభే'తి నామనీ అత్ర భవతః।
21. తృతీయం హృదయం ప్రాజ్ఞస్థానం।
22. 'హృదయస్థా రవిప్రఖ్యే'తి నామనీ అత్రభవతః।

23. ఉపనిషదిచాయమావసథ 'ఇతి' త్రిరభ్య స్తం స్థానత్రయ ప్రదర్శనాయ।

24. ఏవం సంవిదః త్రిపురాత్వం వ్యాఖ్యాతమ్।
25. అథాధిదై వతమ్।
26. సూర్యస్య మండలం ప్రథమం పురమ్।
27. చంద్రస్య ద్వితీయమ్।
28. అగ్నే స్తృతీయమ్।
29. ద్వితీయం పురం గగనమిత్యేకే।

14. ధర్మిధర్మముల అభేదము మూలమునకు శాఖలకుగల సంబంధము వంటిదని వాసిష్ఠగణపతిముని మతము. (ఈ యుపమానము పై యుపమానమువలె భ్రాంతిని సూచించదు. శాఖలకు మూల మాశ్రయమైనట్లే ధర్మమునకు ధర్మిభూత మాశ్రయ మగుచు నొకేస్వరూపమందున్నట్లు సూచించును.)
15. అట్టిసంవిత్తునకు (జ్ఞానశక్తియైన సుందరికి)అధ్యాత్మమందు జాగరిత స్థానమగు చక్షురింద్రియము త్రిపురములలో మొదటిపురము.
16. అక్కడ 'ఫాలస్థా', 'ఇంద్రధనుఃప్రభా' అను నామము లామెకు [ప్రసిద్ధములు.
17. తైజస స్థానమగు శిరస్సు రెండవపురము.
18. విశుద్ధచక్రము (అనగా కంఠము) తైజసునకు స్థానమగునని కొందఱందురు.
19. శిరస్సును కంఠమును గలిపి బంధించు శంఖినీనాడి తైజసస్థాన మని వాసిష్ఠగణపతిముని మతము.
20. అక్కడ 'శిరస్థితా', 'చంద్రనిభా' అను నామము లామెకు [ప్రసిద్ధములు.
21. ప్రాజ్ఞస్థానమగు హృదయమామెకు మూడవపురము.
22. అక్కడ 'హృదయస్థా', 'రవిప్రఖ్యా' అను నామములామెకు ప్రసిద్ధములు. (ఈ విధముగా జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలలో జీవచైతన్యపురుషునకు చెప్పబడు స్థానము లామెయొక్క పురత్రయముగా వచింపబడెను.)
23. ఆమె యావాసమునుగూర్చి త్రిపురోపనిషత్తునందును 'ఇది, యిది, యిది' యని ముమ్మారు పేర్కొనుట యామె స్థాన త్రయమును ప్రదర్శించుచున్నది.
24. ఈ విధముగా సంవిత్తునకు త్రిపురాత్వము వ్యాఖ్యాతమయ్యెను.
25. ఇంక అధిదైవతమునకు జెందిన త్రిపురాత్వమెట్లనగా
26. సూర్యుని మండలము మొదటి పురము.
27. చంద్రుని మండలము రెండవ పురము.
28. అగ్నియొక్క మండలము మూడవ పురము.
29. కొందఱు గగనమును రెండవ పురమనిరి.

30. అధ్యాత్మాధిదైవ సాధారణ్యేన త్రీణిపురాణి పరేషామ్ ।

31. తన్మతే గగనం ప్రథమం పురమ్ ।
32. సూర్యమండలం ద్వితీయమ్ ।
33. హృదయం తృతీయమ్ ।
34. సర్వోత్కృష్ట ప్రకాశత్వాత్ సుందర్యేషా ।

35. 'తస్యభాసా సర్వమిదం విభాతీ'తి శ్రుతిరత్ర భవతి ।

36. జ్ఞాన ప్రదర్శనాయ విషయజ్ఞాన నిరూపణమ్ ।

37. యథాగ్ని ప్రదర్శనాయాంగార నిరూపణమ్ ।
38. మహావాక్యే ప్రజ్ఞానశబ్దస్య విషయజ్ఞానం వాచ్యోర్థః ।
39. శుద్ధజ్ఞానం లక్ష్యః ।
40. విషయోపరక్తం జ్ఞానం విజ్ఞానమ్ ।
41. నిర్విషయం వస్తు ।
42. క్రియాతటస్థం లక్షణం బ్రహ్మణః ।

43. జ్ఞానం స్వరూపలక్షణమ్ ।

44. ముముక్షుః సుందరీ ముపాసీత ।

45. సర్వజ్ఞత్వ కామీవా ।

30. మఱికొంద ఆధ్యాత్మమువలెనే యధిదైవతమును సాధారణ ముగా చెప్పుదురు.

31. అట్టివారి మతములో గగనము మొదటిపురమగును.

32. సూర్యమండలము రెండవ పురమగును.

33. హృదయము మూడవ పురమగును.

34. (ఈవిధమగు) సర్వోత్కృష్ట ప్రకాశమువలన నామె సుందరి యనబడెను.

35. 'ఆమె భాసమానముచేతనే యీసర్వము ప్రకాశించుచున్నది' యను శ్రుత్యర్థ మిక్కడ గమనార్హము.

36. జ్ఞానమును గుఱించి బోధించుటకు మొదట విషయజ్ఞానమును నిరూపింతురు.

37. అగ్నితత్త్వమును ప్రదర్శించుటకు నిప్పుకణికను నిరూపించునట్లే.

38. మహావాక్యములలో 'ప్రజ్ఞాన' శబ్దమునకు వాచ్యార్థము విషయ [జ్ఞానము.

39. లక్ష్యము శుద్ధజ్ఞానము.

40. విషయములయందు ప్రీతిగల జ్ఞానము విజ్ఞానమనబడును.

41. బ్రహ్మవస్తువు నిర్విషయమైనది.

42. సృష్టికర్తయైన బ్రహ్మకు తటస్థక్రియ లక్షణము. (సృష్టియనగా వ్యాపారము. దానిలో నొకభాగమైనను దానినుండి నివృత్తమైయుండు తటస్థక్రియచే బ్రహ్మ పరోక్షముగా ననుభవింపబడుచున్నందున నచలుడైన బ్రహ్మకు తటస్థక్రియ వ్యాపార లక్షణమగును. ఇది నిర్విషయస్థితినే సూచించును.)

43. జ్ఞానము స్వరూపలక్షణము (జ్ఞానము ప్రత్యక్షానుభవమునిచ్చునది గావున)

44. మోక్షము గోరువారందువలన జ్ఞానశక్తియైన సుందరి నుపాసించవలెను.

45. సర్వజ్ఞత్వము గోరువారును. (సుందరి నుపాసించుటవలన క్రియా తటస్థ జ్ఞానము, మూలజ్ఞానముకూడ ప్రాప్తించుననియు,

46. వాక్కామశక్తిభిః ।

47. బ్రహ్మ, యోని, శాంతీంద్ర, మాయాభిః ; ఖ, భృగు, బ్రహ్మ, ఖేంద్ర, మాయాభిః; భృగు, బ్రహ్మేంద్ర, మాయాభిశ్చవా।

48. తామిమాం శ్రీ విద్యామాహుః ।
49. ఆసుర్యేషా గాయత్రీ ।

50. తంత్రాణాం సారః ।
51. రమాన్తయావా శ్రీవిద్యయా ।

52. 'ప్రణవ, మాయా, శ్రీ' పూర్వయా 'శ్రీ, మాయా, కామ, వాణీ, శక్తి' సంపుటితయా శ్రీవిద్యయా వా ।

53. శుద్ధముపాసనం జ్ఞానమూలగవేషణమ్ ।
54. ప్రత్యగ్గత్యాహం స్ఫూర్త్యావవతరణం వా ।

55. ఇయం వైశ్వానరవిద్యే త్యుపనిషది గీయతే ।
56. ఆత్మ విద్యైవ వైశ్వానర విద్యా ।
57. ఆత్మాహి వైశ్వానరః ।

మొదటిదానిచే కర్మనుండి మోక్షము, రెండవదానిచే సర్వజ్ఞత్వము సిద్ధించుననియు భావము.)

46. వాగ్భవకూట, కామకూట, శక్తికూటములు మూడింటితో గూడిన ప్రసిద్ధయగు త్రిపురసుందరీరూపము (అనగా శ్రీచక్రరూపము) చేతను,

47. 'కఏ ఈలహ్రీం, హసకహలహ్రీం, సకలహ్రీం' అను పంచదశాక్షరీ మంత్రముచేతను నుపాసించవలెను. (ఈమంత్రముపై సూత్రములో పేర్కొనబడిన రూపమున కన్వయించునుగావున నామెకీ మంత్రాక్షరము లంగములగును. కనుక కవి చక్రపూజను మంత్రజపమునుగూడ పేర్కొనెను.)

48. దీనినే శ్రీవిద్య యందురు. (అనగా లక్ష్మీసంబంధమగు విద్య).

49. ఆసురీ గాయత్రీ విద్యయనినను నిదియే. ('అసువు' అనగా ప్రాణము; తత్సంబంధమగునదియై ఆసురీ యనబడెను.)

50. ఈవిద్య తంత్రశాస్త్రసారభూతము.

51. 'రమ + అన్తయావా శ్రీవిద్యయా' అను పదచ్ఛేదముచే 'శ్రీం' అను లక్ష్మీబీజము నంతమందు గల్గిన పైమంత్రము— అనగా షోడశాక్షరి యనబడు శ్రీవిద్యయగును. అట్టి దానిచేతను నుపాసించవలెను.

52. 'ఓం హ్రీం శ్రీం—శ్రీం హ్రీం క్లీం ఐం సౌః—పంచదశీ—సౌః ఐం క్లీం హ్రీం శ్రీం' అను 28 అక్షరములుగల శ్రీవిద్యచేనైనను నుపాసించవలెను.

53. శుద్ధోపాసనమెట్టిదనగా జ్ఞానమూలమేది? యని వెతకుట.

54. లేదా, 'అహమ్మహ'మ్మను స్ఫూర్తియొక్క ప్రత్యేకగతి నవతరణమార్గముచే దాని మూలమునకు దించుటయు శుద్ధోపాసనమే.

55. ఇది వైశ్వానరవిద్యయని యుపనిషత్తులందు గానముచేయబడెను.

56. ఆత్మవిద్యయే వైశ్వానరవిద్య.

57. ఆత్మయే వైశ్వానరుడు.

58. ఆత్మానం జానతా గృహ్యమాణా అపి విషయా భేదేన నాను భూయంతే।

---

# చతుర్థః భువనేశ్వరీ పటలః

1. అథ భువనేశ్వరీం వ్యాఖ్యాస్యామః।
2. చతుర్థీ సా దశసు మహావిద్యాసు।
3. భువనేశ్వర్యేవ నామాంతరేణ మాయా।
4. ఈక్షాశక్తి ర్భువనేశ్వరీ మధ్యమాత్వాధిదైవతం।
5. జ్ఞానస్య నిమిత్తభూతః పూర్వోవ్యాపార ఈక్షా।
6. ఈక్షాశక్తి రిచ్ఛాశక్తి రిత్యనర్థాంతరం।
7. క్వచి దీక్షాపూర్వికా సృష్టిః ప్రదర్శ్యతే।
8. క్వచి దిచ్ఛా పూర్వికా।
9. అవిశేషాదేవ ద్వయోః।
10. ఈశస్యైత్యైవ విశాలోదేశః।
11. ప్రతిదర్శక యంత్రే యావద్దృష్టిమతి విశాలంపశ్యామోదేశం।
12. సచ దేశో న యధార్థః।
13. అస్మద్దృష్టే ర్నాతిరిచ్యతే।
14. విమలేజలే పశ్యామో మహాన్తమాకాశమ్।
15. సహ సూర్యేణ దివా।
16. సహ నక్షత్రైః సహచన్ద్రమసా చ నిశి।
17. సచ దేశో న యధార్థః।

58. ఆత్మ నెఱిగినవానిచే విషయములు గ్రహింపబడుచున్నను నవి తనకంటె భిన్నముగా ననుభవింపబడవు. (తటస్థ లక్షణ మాత్మకు—బ్రహ్మకు—నిత్యమని పైని వివరింపబడెను. అట్టి లక్షణముచే యావత్క్రియా వ్యాపారము గ్రహింప వీలగుటచే విషయగ్రహణ ముండవచ్చును. కాని వానియం దనుభవము వేఱుగానుండును. ఇది పూర్ణసిద్ధియందలి విశేషము)

---

# 4. భువనేశ్వరీ పటలము

1. భువనేశ్వరిని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో నాల్గవది.
3. నామాంతరముచే భువనేశ్వరియే మాయ యనబడును.
4. ఈ తూశక్తియగు భువనేశ్వరీవిద్య కధిదైవతము 'మధ్యమ'.
5. జ్ఞానమునకు నిమిత్తభూతమగు పూర్వవ్యాపారమే యీతు.
6. ఈ తూశక్తి యిచ్ఛాశక్తికంటె వే ఱర్థముగలది కాదు.
7. సృష్టికి పూర్వమీతు కారణమైనట్లు కొన్నిశ్రుతులు ప్రదర్శించును.
8. మఱికొన్ని యిచ్ఛకారణమైనట్లు ప్రదర్శించును.
9. ఈ తుకు నిచ్ఛకు వ్యత్యాసవిశేషము లేనందున (అట్లు ప్రదర్శించెను).
10. ఈశ్వరుని యీతుయే విశాలదేశమయ్యెను.
11. ప్రతిదర్శక యంత్రమందెంత విశాలము దృష్టికంతకు నగపడునో మన మంత దేశమును చూచెదము.
12. అది యథార్థమగు దేశము కాదు.
13. మనదృష్టికంటె మించినది కాదు (వేఱుకాదు).
14. నిర్మలమైన జలమందు మహోన్నతమైన ఆకాశమును చూతుము.
15. పగటిపూట సూర్యునితో సహా చూతుము.
16. రాత్రిపూట చంద్ర నక్షత్రములతో సహా చూతుము.
17. అదియు నిజమగు దేశము కాదు.

18. అస్మ ద్దృష్టే ర్నాతిరిచ్యతే।
19. స్వప్నదేశశ్చైవమ్।.
20. యావతీ దృష్టి స్తావాన్దేశో భవతి।
21. ఈశ్వరస్య దృష్టి రపారా।
22. తస్మాత్ విశ్వస్య దేశశ్చాపారః।
23. అపారశ్చ దేశః పరమాకాశా న్నాతిరిచ్యతే।
24. తస్మా ద్భువనేశ్వరీ పరమాకాశః।
25. విశ్వస్మి న్పరమాకాశో భిత్తి స్థానీయః।
26. క్రియా శబ్ద విజ్ఞానాని చిత్రస్థానీయాని।
27. తస్మా ద్భువనేశ్వర్యాం పూర్వాః ప్రతితిష్ఠంతి।

28. విశ్వం ప్రతితిష్ఠతీ త్యుక్తం భవతి।
29. ఈశా వల్యాం మూలమిచ్ఛా।

30. ఆద్యాదృష్టి రిచ్ఛేత్యుక్తం భవతి।
31. ప్రతిదృష్టిశ్చేచ్ఛాస్తీ త్యేకే।
32. రసానుభూత్యౌదాసీన్యాభ్యాం తద్భావాభావనిర్ణయో లోకే।

33. ఈశ్వరేచ తథాస్యాత్।
34. సర్వ రసానుభూతిమానీశ్వర ఇత్యేకః పక్షః।
35. అసంగ ఇత్యన్యః।
36. పరమాకాశ ఏవాదితి రుచ్యతే।
37. అఖండ్యత్వాత్।
38. ఈశ్వరః కశ్యప ఉచ్యతే।
39. పశ్యతీతి।

40. అదితిః సర్వేషాం దేవానాం మాతా।

18. మన దృష్టికంటె వేఱును గాదు.
19. స్వప్నమం దగపడు దేశము వంటిదే.
20. దృష్టి యెంతవఱకు వ్యాపించునో దేశ మంతవఱకే వ్యాపించును.
21. ఈశ్వరుని దృష్టి యపారము.
22. ఆ కారణముచేత విశ్వముయొక్క దేశ మపారము.
23. అపారమైన దేశము పరమాకాశముకంటె వేఱు కాదు.
24. అందువలన (నీశ్వరదృష్టియైన) భువనేశ్వరి పరమాకాశమగును.
25. విశ్వవిషయములో పరమాకాశము గోడవంటిది. [వంటివి.
26. క్రియా శబ్ద విజ్ఞానములు మూడును గోడపై బడు చిత్రములు
27. కనుక భువనేశ్వరియం దా మూడును ప్రతిష్ఠితములగును. (అనగా కాళీ తారా సుందరీల ప్రకాశమునకు భువనేశ్వరి తెరవంటిది).
28. ఆమెయందు విశ్వమంతయు ప్రతిష్ఠితమైనట్లును చెప్పనగును.
29. ఈక్ష (దృష్టి) యొక్క వ్యాపార మనెడి లతకు మూల మిచ్ఛ యగును.
30. (వ్యాపారరూపము బొందని) మొదటి దృష్టి నిచ్ఛ యనవచ్చును.
31. ప్రతిఫల దృష్టికూడ యిచ్ఛ యగునని కొందఱనిరి.
32. లోకమందు రసానుభవమువల్లను ఉదాసీనమువల్లను ఏ వస్తువు నైన నున్నట్లు లేనట్లు (భావాభావములను) నిర్ణయించు చుంటిమి.
33. ఈశ్వరుని నిర్ణయించుటకు నదే మార్గము.
34. ఈశ్వరుడు సర్వరసానుభూతిమంతుడని యొక తెగవా రందురు.
35. అసంగుడని యింకొక తెగవా రందురు.
36. పరమాకాశమే అదితి యనబడెను.
37. ఖండముగానిదగుటవలన (అ + దితి = ఖండీభూతముకానిది).
38. ఈశ్వరుడు కశ్యపు డనబడెను.
39. చూచినవాడగుటచేత ('కశ్యపః పశ్యకో భవతి' అనునది యక్షర వ్యత్యాసముచే నగుట యిచ్చట యన్వయింపబడెను).
40. అదితి సర్వదేవతలకు తల్లి (ఈశ్వరదృష్టి).

41. కశ్యపః పితా।

42. తన్నామ్నా మునిదంపత్యో ర్వ్యవహారః।
43. తౌ న దేవానాం మాతా పితరౌ।
44. అస్యామేవశక్త్యాం సర్వంభువన మోతంప్రోతం చ।

45. 'ఆకాశే ఖలు' గార్గీతి శ్రుతేః।

46. తథోపలబ్ధేశ్చ।
47. తస్మా ద్భువనేశ్వరీయ ముచ్యతే।
48. భువనమప్యేషైవ భవతి।
49. ప్రకృతిత్వాత్।
50. ప్రకృతిత్వం చాస్యా మూలదృష్టిరితి।
51. ఏవం జగతో దృష్టిమూలకత్వం వ్యాఖ్యాతమ్।

52. అస్మద్దృష్టిరేవ సృష్టిరితి పరే।

53. స్వప్నసృష్టిరేవ సా।
54. 'అస్మత్' శబ్దస్య బ్రహ్మపరత్వేతు న విప్రతిపత్తిః।

55. త్రయాణాం వ్యాపకత్వే ప్రమాణాని దృశ్యంతే।

56. 'అదితి ర్జాత మదితి ర్జనిత్వ' మితి దేశస్య।

57. 'యమోహా జాతో యమోహా జనిత్వ' మితి కాలస్య।

41. కశ్యపుడు (ద్రష్ట) తండ్రి (పురాణములం దదితి కశ్యపులను మూలవ్యక్తు లనిరి – అనగా నాకాశరూపిణి, బ్రహ్మ).
42. ఆ పేర్లు ఇద్దరు మునిదంపతుల కుంచబడినట్లును వ్యవహారము.
43. వారు దేవతలకు తల్లిదండ్రులు కాజాలరు.
44. అదితి యను శక్తియందే భువనమంతయు పడుగుపేకవలె రూపొందెను. (వస్త్రమున కసలు రూపము లేకున్నను పడుగు పేకలచే నేర్పడినట్లే).
45. (పడుగుపేకవలె భువనము) ఆకాశమందే యున్నదని గార్గికి చెందిన శ్రుతివాక్య తెల్పును.
46. దానినిబట్టి విదితమగునది యేమనగా,
47. పై కారణమువలన భువనేశ్వరినే యాకాశముగా వచింపబడిన
48. ఆమెయే భువనముగను అగుచున్నది. [ట్లగును.
49. ప్రకృతియగుటవలన.
50. ప్రకృతిత్వముచేతనే యామె మూలదృష్టి యైనట్లగును.
51. ఈ విధముగా జగత్తునకు దృష్టిమూలకత్వము (అనగా జగత్సృష్టి కీశ్వరదృష్టి మూలకారణమనునది) వ్యాఖ్యాత మయ్యెను.
52. మనయొక్క దృష్టివల్లనే జగత్తు సృష్టింపబడుచున్నట్లు కొంద అందురు.
53. స్వప్నమందు సృష్టివలెనే అదియునని.
54. 'మన' యను నస్మచ్ఛబ్దమునకు బ్రహ్మపరముగా నర్థముగైకొని నచో (వారియభిప్రాయముతో) భేదముండదు.
55. మూడు వ్యాపకత్వములకు (అనగా పైని వచింపబడిన ద్రష్ట – దృక్ – దృశ్యములకు లేదా పురుషుడు – కాలము – దేశ ములకు) ప్రమాణము లగపడును.
56. 'అదితియే పుట్టినది పుట్టుకలకు క్షేత్రమైనదియు' నను నర్థముగల శ్రుతి వాక్య దేశవ్యాపకత్వమునకు ప్రమాణము.
57. కాలము విషయములో 'పుట్టినది పుట్టబోవునదియు యమత్వ' మను నర్థముగల శ్రుతి ప్రమాణము.

58. 'పురుష ఏవేదం సర్వ' మితి పురుషస్య ।

59. దేశవ్యాపకత్వం వైశాల్యమివ విశ్వస్య ।
60. దైర్ఘ్యమివ కాలవ్యాపకత్వమ్ ।
61. స్వరూపమివ పురుషవ్యాపకత్వమ్ ।
62. తస్మాన్న విప్రతిషేధః ।
63. భువనేశ్వరీ పరమా శాంతా ।
64. సర్వాభ్యః క్రియాభ్య ఆత్మానం సమర్ప్య నిశ్చలాతిష్ఠతి ।

65. పరమాం శాంతిం కామయమానో భువనేశ్వరీ ముపాసీత ।

66. మాయయా ।
67. ప్రణవ సంపుటి తయావా ।

68. ద్వితీయ శ్చింతామణి రుచ్యతే ।

69. శుద్ధ ముపాసనమ్ ।
70. దృగ్దృశ్యయో రంతరభూత ఆకాశ ఏవ సదా ద్రష్టవ్యః ।

71. సంసారిణాంతు దృష్టేర్మార్గ ఏవ నభః ।

72. న లక్ష్యమ్ ।
73. పృథివ్యాద్యుపాసనం కష్టమ్ ।

74. ప్రియాఽప్రియోభయాస్పదత్వాత్ ।

58. పురుషవ్యాపకత్వమునకు 'పరమపురుషుడే యీ సర్వమును (బుట్టించి పుట్టినవాడు) అయ్యె' నను భావముగల శ్రుతి ప్రమాణము.

59. దేశవ్యాపకత్వము విశ్వముయొక్క వైశాల్యముగా నున్నది.

60. విశ్వస్థితికి జెందిన దీర్ఘత్వముగా కాలవ్యాపకత్వమున్నది.

61. విశ్వముయొక్క స్వరూపముగా పురుషవ్యాపకత్వమున్నది.

62. అందువలన విరోధము తొలగినట్లగును. (అదితి భువనేశ్వరీలకు)

63. భువనేశ్వరి పరమమైనది,- శాంతిమయమైనది.

64. సర్వక్రియలనుండి యాత్మను సమర్పించి (అనగా కర్తృత్వము నీశ్వరున కర్పించి) నిశ్చలమై పరాకాశరూపిణి యుండును.

65. కావున పరమమైనదానిని, శాంతిని గోరువాడు భువనేశ్వరి నుపాసించవలెను.

66. 'హ్రీం' అను మాయాబీజ మొక్కదానితోగాని

67. 'ఓం' అను ప్రణవముతో జేర్చిన మాయాబీజముచేగాని (ఓం హ్రీం ఓం)

68. ఈ యుపాసన చింతామణిని వెనుకచేయునందురు. (ఇంకొక యర్థమేమనగా నీయుపాసన రెండవ చింతామణియనబడునని. చింతామణియను పేరుతో ప్రసిద్ధమై యొక మంత్రమున్నది. దాని నిక్కడ కవి స్మరించుచుండెను.)

69. శుద్ధోపాసన మెట్లనగా

70. దృక్ -దృశ్యములకు నడుమనుండు నాకాశమును సదాచూచుట ద్వారా శుద్ధోపాసనమగును (ఆకాశమే యామె కనుక).

71. సంసారమందు మునిగినవారి కాకాశము దృష్టికి మార్గమగు నుపాధివలె దోచును.

72. అంతేకాని లక్ష్యమైన దైవస్వరూపమువలె దోచదు.

73. పృథివ్యాది స్థూలవస్తువుల నిట్లుపాసించుట కష్టము. (అవియు వ్యాపించినవైనను.)

74. అవి ప్రియాప్రియములు రెండింటి కాస్పదములగుటచేత.

75. యత్ర ద్వంద్వోపరమ స్తల్లక్ష్యముత్తమమ్।
76. తాదృశ ఆకాశః।
77. ఆకాశే న కస్యచి ద్ద్వేషః సంగోవా।
78. 'దర్శనా దభ్ర సదసీ'తి శ్లోకోఽత్ర భవతి।

79. అభ్రస్య సదస్త్వం బ్రహ్మాండ సంకీర్ణత్వాత్।

80. సేయం హిరణ్మయాండానాం సభాద్యాః కనకసభోచ్యతే।

81. తత్రేశస్య తాండవం కాలీపటలే వ్యాఖ్యాతం।

82. దివం పశ్యన్సాక్షిణి ప్రతితిష్ఠతి।
83. దృష్టావేవ హి తదా దృష్టిః।

84. ఇయం 'పరోవరీయసీ' విద్యోపనిషది గీయతే।
85. పరోవరీయా నుద్గీథ ఆకాశోహి।
86. తత్రాకాశ మీశ మేకే వ్యాచక్షతే।

87. అభేదా త్తదుపపద్యతే।
88. దృష్టే ర్వస్త్వేవ హి లక్ష్యార్థః।

---

## పంచమః భైరవీ పటలః

1. భైరవీం వ్యాఖ్యాస్యామః।
2. పంచమీ సా దశసు మహావిద్యాసు।
3. భైరవ్యేవ త్రిపురభైరవీ।

75. ద్వంద్వముల నేది శాంతింపజేయునో దాని లక్ష్యముత్తమము.
76. ఆకాశమట్టిది.
77. ఆకాశమునకు దేనితోడను ద్వేషములేదు, సంపర్కమునులేదు.
78. దర్శనమాత్రముచేత నాకాశమొక సదస్సగునని (అనగా చిత్ర విచిత్రములను ప్రదర్శించు వేదిక యగునని) యొక ప్రసిద్ధ శ్లోకము చెప్పుచున్నది. (చిదంబరక్షేత్ర స్తుతి)
79. బ్రహ్మాండసృష్టిసంకీర్ణత్వముచే నాకాశమునకు సదస్త్వ మొప్పును.
80. ఆయీ హిరణ్మయాకృతి గోళములుండు నాకాశసభనే కనక సభ యనిరి.
81. ఆకనకసభయం దీశ్వరుని తాండవమును గుఱించి కాళీ పటల మందు వ్యాఖ్యానింపబడెను.
82. ఆకాశమును జూచుచున్న దృష్టియందు సాక్షిణిత్వము ప్రతిష్ఠిత [మగును.
83. దృష్టియందే లక్ష్యముంచి చూచుటవలన (దృష్టికి లక్ష్యమగు నాకాశమదృశ్యము గనుక సులభముగా దృష్టికి దృష్టియే లక్ష్యమగును)
84. 'పరోవరీయసీ' యని యీ విద్యనుపనిషత్తులు స్తుతించెను.
85. ఉద్గీథాకాశమే (అవ్యక్తశబ్దముగలది) పరోవరీయము.
86. అక్కడ (అనగా ఉపనిషత్తులలో) ఆకాశమునే కొంద ఱీశ్వరు డనుచున్నారు.
87. అభేదమున్నందున నీ యర్థము యుక్తమై యున్నది.
88. దృష్టికి (పరా)వస్తువే కదా లక్ష్యార్థము.

---

# 5. భైరవీ పటలము

1. భైరవిని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశ మహావిద్యలలో నైదవది.
3. భైరవియే త్రిపురభైరవి.

4. పరావాగ్భైరవీ ।
5. సుందర్యా స్త్రిపురాత్వేన భైరవ్యాస్త్రిపురాత్వం వ్యాఖ్యాతం ।

6. సూక్ష్మశబ్ద జ్ఞానయో రభేదాత్ ప్రాయః ।
7. దేవతైక్యేపి తత్త్వవిభూతిభేదాత్ విద్యాభేదః ।

8. మూలాధారే నిష్ఠాఽస్యాః శుద్ధముపాసనం ।
9. సహి పరాయా ఆలయః ।

10. అస్యా అపి మంత్రః శ్రీవిద్యోచ్యతే ।
11. అత్ర ఖ భృగ్వగ్నివాగ్భిర్యుక్తాభిః ఆదిబీజం ।
12. ఖ భృగు కామాగ్నిభిర్యుక్తై ర్ద్వితీయం ।
13. ఖ భృగు వహ్ని చతుర్దశ సర్గైర్యుక్తైః తృతీయం ।
14. సుందర్యామివాత్రాపి ప్రథమం వాగ్భవం కూటం ।
15. ద్వితీయం కామరాజం కూటం ।
16. తృతీయం శక్తి కూటం ।
17. అనయా విద్యయా భైరవీ ముపాసీత మోక్షకామః ।
18. విద్యా కామోవా ।
19. 'జాతవేదస' త్రిష్టుభేమాం కష్టతరణ కామః ।

20. అస్యా ఏవ దేవగణ తృప్తిదం స్వాహేతి నామ ।
21. స్వధేతి చ పితృగణ తృప్తిదం ।

---

4. పరావాక్కు భైరవి యగును.
5. సుందరియొక్క త్రిపురాత్వవ్యాఖ్యానముచే భైరవియొక్క త్రిపురాత్వము వ్యాఖ్యానమయ్యెను.
6. సూక్ష్మశబ్దమునకు జ్ఞానమునకు ముఖ్యముగా భేదములేనందున.
7. దేవత యొక్కటియైనను తత్త్వవిభూతియందున్న భేదముచే విద్యయందు భేదము గల్గెను.
8. మూలాధారమందు నిష్ఠయే భైరవియొక్క శుద్ధోపాసనము.
9. అదియు పరాసంబంధమైనదానికి (పరావాక్కుగా నన్వయించుకొనవలెను) ఆలయమగుచున్నది.
10. భైరవీ మంత్రముకూడ శ్రీవిద్య యనబడును.
11. మొదటి బీజము 'హ్స్రైం'
12. రెండవది 'హ్స్క్లీం'
13. మూడవ బీజము 'హ్స్రౌః'
14. సుందరీ విద్యలోవలె మొదటిది వాగ్భవ కూటము.
15. రెండవది కామరాజ కూటము.
16. మూడవది శక్తి కూటము.
17. మోక్షముగోరు వాడీ విద్యచే భైరవి నుపాసించవలెను.
18. విద్యను గోరువాడును.
19. "జాతవేదస..." యను త్రిష్టుభ మంత్రముచే భైరవిని కష్టములు దాటగోరువా డుపాసించవలెను. (ఇది వేదమంత్రము.)
20. ఈ భైరవీశక్తికే దేవగణములను దృప్తిబరచు 'స్వాహా' యని,
21. పితృగణములను దృప్తిబరచు 'స్వధా' యని పేర్లు ప్రసిద్ధములు.

---

(మనయందు స్మృతి రెండు రూపములగుచున్నది - వాక్స్మృతి, అర్థస్మృతి. వాగ్రూపములకు క్షేత్రమువంటి శ్రుతియే ప్రణవమై, కేవలమైనప్పుడు పరావాక్కనబడుచున్నది. అర్థస్మృతులను గ్రహించు జ్ఞానము నిర్విషయమైనప్పుడు పరాజ్ఞానమైనట్లే. పరాశబ్దజ్ఞానములే భైరవీ సుందరీలు. ఇవి ప్రత్యేకస్మృతిసంబంధములే.)

(పూర్వపంచక మింతతో ముగిసెను.)

# షష్ఠః ప్రచండ చండికా పటలః

1. ప్రచండ చండికాం వ్యాఖ్యాస్యామః।
2. షష్ఠీ సా శక్తి ర్దశసు మహావిద్యాసు।
3. ప్రచండ చండిక్త్యైవ ఛిన్నమస్తా నామాంతరేణ।
4. కాల్యా స్తత్త్వేన ప్రచండచండికాయా స్తత్త్వం వ్యాఖ్యాతమ్।
5. అస్తి కశ్చన విశేషః।
6. సామాన్యతః పరిణమయిత్రీ విద్యుచ్ఛక్తిః కాలీ।
7. ప్రభోరాయుధభూతా ప్రచండచండికా।

8. అత ఏవ వజ్రవైరోచనీ యేతిచ కథ్యతే।
9. వజ్రం హ్యాయుధం ప్రభోః।
10. విరోచనస్య శక్తి ర్వైరోచనీయా।
11. విశేషేణ రోచత ఇతి ప్రభురేవ విరోచనః।

12. వైరోచనీ వా నామతః।
13. 'వైరోచనీం కర్మఫలేషు జుష్టా' మితి మంత్రోత్ర భవతి।

14. అధిదైవతం తు మధ్యమా।
15. కాలీ సుందరీ భువనేశ్వరీణాం దేవతా మధ్యమా గౌరీయం త్వింద్రాణీ త్యేకే।

16. నామభేద ఏవ న వ్యక్తిభేద ఇతి వాసిష్ఠః।

17. వ్యక్తిభేదేవా వేషభేద ఏకస్యాః।

# 6. ప్రచండ చండికా పటలము

1. ప్రచండ చండికను గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహా విద్యలలో నాఱవది.
3. ప్రచండచండికయే ఛిన్నమస్త యను నామాంతరము కలది.
4. కాళీ తత్త్వముచే ప్రచండచండికాతత్త్వము వ్యాఖ్యాతమయ్యెను.
5. కాని కొంత విశేషమున్నది.
6. సామాన్యముగా పరిణామములను గల్పించు విద్యుచ్ఛక్తి కాళి.
7. ప్రభువుయొక్క ఆయుధభూతమగు విద్యుచ్ఛక్తి (శాసించునది) ప్రచండచండిక.
8. కనుకనే యీామెను 'వజ్రవైరోచనీయా' అనియు పిలుచు [చున్నారు.
9. వజ్రమే ప్రభువుయొక్క ఆయుధము.
10. విరోచనుని శక్తి 'వైరోచనీయా'.
11. విశేషముగా (వజ్రముచే) బ్రకాశించు ప్రభువగుటచే విరోచనుడయ్యెను. (కనుక వజ్రమందు బ్రకాశింపజేయు శక్తి వైరోచనీయాయగును).
12. వైరోచనీ యనియు పేరున్నది.
13. 'కర్మఫలముల ననుగ్రహించునది వైరోచనీ' అను నర్థముగల మంత్ర మిక్కడ ప్రమాణము.
14. ఈ విద్య కధిదైవతము 'మధ్యమ'.
15. కాళీ, సుందరీ, భువనేశ్వరీ విద్యలకు దేవతయైన మధ్యమను 'గౌరి' యందురు. ఈమెనే 'ఇంద్రాణి' యనియు కొందఱు పిలుతురు. (ఆ యింద్రాణియే ప్రచండ చండిక యగుచున్నది.)
16. నామభేదమేకాని వ్యక్తిభేదము లేదని (అనగా నధిష్ఠానతత్త్వముచే నిఱువురు కారని) వాసిష్ఠగణపతిముని యభిప్రాయము.
17. వ్యక్తిభేదమున్నట్లు తోచినయెడల నది యొకేస్వరూపము యొక్క వేషభేదమగును (కాని యితరము కాదు).

18. మధ్యమశ్చే ద్భిన్నవేషో మధ్యమాపి భిన్నవేషా ।

19. అధ్యాత్మమపి కాల్యా స్తత్త్వేన ప్రచండచండికాయా స్తత్త్వం వ్యాఖ్యాతమ్ ।

20. అస్తి కశ్చన విశేషః ।

21. సామాన్యతః ప్రాణమావిష్టా కుండలినీ కాలీ ।

22. యోగిషు సుషుమ్నయా ప్రవహంతీ పశ్చాత్ప్రచండ చండికా ।

23. సుషుమ్నాయాం చ ప్రచండ చండికా వ్యవహారః ।

24. సా యోగిషు ఛిన్నమస్తా భవతి ।

25. ఛిన్నమస్తాత్వంచ కపాలద్వయ భేదాత్ ।

26. న కేవలం మరణే ।

27. జీవిత కాలేపి ।

28. భిన్నకపాలోపి యోగీ జీవితుం శక్నుయాత్ ।

29. 'వ్యపోహ్య శీర్ష కపాలే' ఇతి శ్రుతి రత్ర భవతి ।

30. దేవ్యా ఏవం ఛిన్నమస్తాత్వం వ్యాఖ్యాతమ్ ।

18. మధ్యముడైన ప్రభువు (అంతర్యామి) భిన్నవేషుడైనచో మధ్యమయు భిన్న వేషియే.

19. అధ్యాత్మమందును కాళీతత్త్వముచేతనే ప్రచండచండికయొక్క తత్త్వము వ్యాఖ్యానమైనదగును.

20. కొంచెము మాత్రమిందును విశేషమున్నది.

21. సామాన్యముగా ప్రాణమునావేశించిన కుండలినీశక్తి కాళి యగును.

22. యోగులయందు (అనగా తమోనాశనముచే కుండలినియొక్క యుద్గారమును సాధించినవారియందు) సుషుమ్నలో ప్రవహించు పశ్చాన్నాడీ శక్తిని ప్రచండచండిక యందురు. (సుషుమ్నయనబడు నాడి మూలాధారమునుండి వెన్నెముక ద్వారా శిరస్సువఱకు వ్యాపించి పశ్చాన్నాడి యనబడుచున్నది. అది శిరస్సును బొందినపిదప శిరస్సునుండి యమృతానాడి యనుపేరుతో రొమ్మువైపున నుండు హృదయమునకు వ్రేలాడును. ఇది పురోనాడి యగును కనుక పశ్చాన్నాడీ విలాసమును మాత్రమే కవి పేర్కొనినట్లు గ్రహించవలెను).

23. సుషుమ్న యందే ప్రచండచండిక వ్యవహారముగావున. (కాళికి శరీరమంతటను వ్యవహారము).

24. అట్టి (అనగా నామె వ్యవహారమును బొందినట్టి) యోగులందామె ఛిన్న మస్త యగుచున్నది.

25. శీర్షకపాలముల రెండింటిని భిన్నమొనర్చుటయే ఛిన్నమస్తాత్వము.

26. మరణకాలమందు మాత్రమే చేయుటకాదు.

27. జీవితకాలమందును (విచ్ఛిన్నమొనర్చునది ఛిన్నమస్తయగును).

28. కపాలవిచ్ఛేదము బొందియు యోగి జీవించగలడు (కవి కిది స్వానుభవము).

29. 'వ్యపోహ్య శీర్షకపాలే....' అను శ్రుతి యిక్కడ ప్రమాణము.

30. దేవియొక్క ఛిన్నమస్తాత్వ మిట్లు వ్యాఖ్యానమయ్యెను. (ఈమె

31. డాకినీ వర్ణిన్యౌ దేవ్యాః సఖ్యౌ ।

32. ఇడైవ డాకినీ ।
33. పింగలైవ వర్ణినీ ।
34. ఛిన్నమస్తాయాః సుషుమ్నాయాః స్వాయత్తత్వాత్ మస్తకం కరస్థిత మివస్యాత్ ।
35. ఇదమేవ ధ్యేయవిగ్రహే తత్కరస్థస్య నిజమస్తస్య తాత్పర్యమ్ ।
36. కబంధా దుద్గతం రక్తధారా త్రికం నాడ్యగ్రా దుద్గత మమృత ధారా త్రికమ్ ।

37. ఏకయా శిరస స్తర్పణమ్ ।
38. ఇతరాభ్యా మిడా పింగళయోః ।
39. తద్ద్వారా సర్వస్య దేహస్య ।

40. ధ్యేయవిగ్రహే రతికామయోః పాదాభ్యా మవష్టంభనేన కామజిత్వం శక్తే ర్వ్యజ్యతే ।

41. సిద్ధేషు భగవత్యా అభివ్యక్తిః ।
42. యః సిద్ధా నారాధయేత్ స భగవతీం షష్ఠీ మారాధయతి ।

43. ఇత్యధ్యాత్మమ్ ।
44. అథాధిలోకమ్ ।
45. దేవయానః పంథాః ప్రచండచండికా ।

కృపను బొంది కపాలభేదసిద్ధి బొందినవారికి పిదప పురోభాగ మందున్న అమృతానాడి తెరువబడి దాని విలాస మనుభవ మగును).

31. డాకినీ వర్ణినీ లిద్దరు దేవియొక్క సఖురాండ్రు. (వీ రిఱువురకు మధ్య నున్నందునను మధ్యమ యను పే రీమెకు సార్థకమగును).

32. ఇడా నాడియే డాకిని.

33. పింగళా నాడియే వర్ణిని.

34. ఛిన్నమస్తకు సుషుమ్నయొక్క స్వాధీనముండుటచేత మస్తకము హస్తగతమైనట్లగును (అనగా స్వాధీనమైనట్లు).

35. ధ్యేయవిగ్రహమందామె శిరస్సు నామె హస్తమందే యుంచుట కిదియే తాత్పర్యము.

36. కబంధమునుండి వెడలుచున్నట్లు ధ్యేయవిగ్రహమందు జూపబడు మూడు రక్తధారలు యోగసిద్ధి బొందినవాని నాడీయగ్ర మనబడు భ్రూమధ్యనుండి వెడలు మూ డమృతధారల కర్థము.

37. ఒక ధార శిరస్సుయొక్క తర్పణముకొఱకు (సహస్రారమందు).

38. మిగిలిన రెండు నిడా పింగళములయొక్క యగుచు,

39. వాని ద్వారా దేహమంతటను తర్పణముకొఱ కగుచున్నవి. (తర్పణ మనగా తడపుట యని గ్రైకొనవలెను).

40. ధ్యేయవిగ్రహముయొక్క రెండు పాదములచే రతికామము లవష్టంభనమగుటబట్టి యీామె కామమును జయించు శక్తి నిచ్చునని బోధపడును.

41. సిద్ధులయం దీ భగవతియొక్క స్పష్టమైన వ్యక్తత్వముండును.

42. ఎవడు సిద్ధుల నారాధించునో వా డీ యాఱవ విద్యాస్వరూపిణి నారాధించినవాడగును. .

43. ఇ ట్లధ్యాత్మ సంబంధము (ముగిసెను).

44. ఇంక నధిలోకము గుఱించి.

45. (అధిలోకమందు) దేవయానమార్గమే ప్రచండచండికారూపము. (దేవయానమార్గ మనగా Milky way – ఆకాశముమీాదుగా

46. సా జుష్టా కర్మ ఫలేషు ।
47. దుర్గా నామాంతరేణ ।
48. దుర్గమా హ్యాకృతాత్మనామ్ ।
49. ఆదిత్యమండలా దస్మత్సుషుమ్నాపర్యంతమస్తి కశ్చన
మార్గః ।

50. సచాసంఖ్య శాఖః ।
51. రశ్మయస్తే నాయాంతి ।
52. యావంతః ప్రాణిన స్తావత్యః శాఖాః తస్యపథః శరీర ఇహ
రశ్మీనాం ఆగమనాయ ।
53. సుషుమ్నాయా ఏవైషా విభూతిః ।
54. సుషుమ్నా నకేవలం శరీరమాత్ర నిష్ఠా నాడీ ।
55. అపి త్వనేకాభిః శాఖాభిః ప్రపంచేస్థితా నాడీ ।
56. సా రశ్మీ నధో నయతి ।
57. ఊర్ధ్వంచ శుద్ధాన్ప్రాణా న్మరణే ।
58. ఏకైకా శాఖా తస్యా అసంఖ్య సూక్ష్మరేణుమయీ ।
59. సోఽయం దేవయానః పంథా అంతరిక్షా న్నాతిరిచ్యతే ।

60. అతఏవాంతరిక్షం మహద్రజ ఉచ్యతే మహర్షిభిః ।

పుష్పాడివలె ప్రకాశించు రేణుమయ భాగము).

46. ఆమెయే కర్మఫలభూతము నిచ్చునది. (అధిదైవతమందువలెనే)

47. దుర్గ యను నామాంతరము కలది.

48. కృతకృత్యులు కానివారికి బొందశక్యముగానిదై (దుర్గమమై) దుర్గ యనబడెను.

49. ఆదిత్యమండలము మొదలుకొని మనయందున్న సుషుమ్న పర్యంత మొక మార్గమున్నది. (దేవయానమార్గమందు రేణుమయ తేజమాదిత్యమండలమును బొంది రశ్మి రూప మగుచున్నది. కనుక సృష్టికార్యమం దొక్కొక్క రశ్మియు ప్రభుని ఆయుధశక్తి కస్త్రలక్షణమని భావింపనగును).

50. ఆ మార్గ మసంఖ్యాకమగు శాఖలు కలది.

51. అందుండి రశ్మిలు వచ్చుచున్నవి.

52. రశ్మి లిక్కడ వ్యష్టి శరీరములలో జొరబడుట కెందఱు ప్రాణులో అన్ని శాఖలా మార్గమున కుండును.

53. అట్టి విభూతులు సుషుమ్నయందున్నవి. [కాదు.

54. సుషుమ్న యనునది కేవలశరీరమాత్రముచే నిష్ఠబొందు నాడియే

55. అదియు సుషుమ్నయైనను, అనేకశాఖలచే ప్రపంచమందు స్థితమైన నాడి సుషుమ్న యనబడును.

56. ఆ సుషుమ్న రశ్మిలను క్రిందునకు బొందించును.

57. శుద్ధమైన ప్రాణముల కూర్ధ్వగతినికూడ (జీవుల) మరణకాలమున బొందించును.

58. ఆ సుషుమ్నయొక్క శాఖ యొక్కొక్కటియు మఱల నసంఖ్యాకమగు సూక్ష్మరేణుమయమై యుండును.

59. మొదట చెప్పబడిన దేవయానమార్గము (రేణుమయమై ప్రకాశించు నాకాశము) అంతరిక్షముకంటె వేఱుకాదు. (అదియే యంతరిక్షమని భావము).

60. అందువల్లనే మహర్షు లంతరిక్షమును మహాద్రజ మనిరి.

61. రేణుకా తాంత్రికైః।

62. పరశురామ జననీ రేణుకాతు తదంశావతారః।
63. సా చ ఛిన్నమస్తోచ్యతే ఛిన్నశీర్షత్వాత్ ।

64. అస్మాకం సుషుమ్నా మార్గే గ్రంథిత్రయ మస్తి।
65. ఏకో మూలే।
66. స బ్రహ్మగ్రంథి రుచ్యతే।
67. అపరో మణిపూరే।
68. స విష్ణు గ్రంథి రుచ్యతే।
69. ఇతర ఆజ్ఞాచక్రే।
70. స రుద్రగ్రంథి రుచ్యతే।
71. తేన గ్రంథిత్రయేణాస్మాసుశక్తి రంతరిణాన్నబహూల మవ తరతి।
72. భిన్నగ్రంథౌతు బహూలం ప్రవహతి।
73. మార్గస్య నిర్నిరోధత్వాత్ ।
74. సిద్ధానాం వ్యష్టినాడీ సమష్టినాడ్యా మిలితా మహామహిమా స్యాత్ ।
75. క్రమేణ గ్రంథీనాం మోక్షః।

76. రుద్రగ్రంథౌ భిన్నే కైవల్యం హస్తస్థం స్యాత్ ।
77. 'కాశ్యాంతు మరణా న్ముక్తి' రితి శ్లోకోఽత్ర భవతి।

78. ఇయమేవ కాశీ యదాజ్ఞా చక్రమ్ ।
79. అత్ర మరణంచ గ్రంథిభేదః।

61. దానినే తాంత్రికులు రేణుక యనిరి. (తేజస్సును రేణువులక్రింద విభజించునది).

62. పరశురామజననియైన రేణుకయు నామె యంశావతారిణియే.

63. ఈ రేణుకయు ఛిన్నమైన శిరస్సువలన ఛిన్నమస్త యనబడుచున్నది.

64. మనయొక్క సుషుమ్నామార్గమందు మూడు గ్రంథులున్నవి.

65. ఒకటి మూలాధారమందు.

66. అది బ్రహ్మగ్రంధి యనబడును.

67. రెండవది మణిపూరమందు.

68. అది విష్ణుగ్రంధి యనబడును.

69. మూడవది యాజ్ఞాచక్రమందు.

70. అది రుద్రగ్రంధి యనబడును.

71. ఈ గ్రంధిత్రయమువలన మనయందంతరిక్షమునుండి (ప్రవహించు) శక్తి బహుళముగా నవతరించుట లేదు.

72. గ్రంథులు భేదింపబడినచో శక్తి బహుళముగా ప్రవహించును.

73. సుషుమ్నా మార్గమందు నిరోధములు తొలగుటవలన.

74. అవి తొలగిన సిద్ధులయొక్క వ్యష్టి సుషుమ్నానాడి సమష్టి సుషుమ్నానాడితో మిళితమై మహామహిమగలది యగును.

75. గ్రంథుల మోక్షము క్రమప్రకారమగును. (అనగా బ్రహ్మగ్రంధి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంధులు వరుసను సాధనబలము కొలది యొకదాని పిదప నొకటిగా వీడును.)

76. రుద్రగ్రంథి భేదనమైన వారికి కైవల్యము హస్తగతమగును.

77. 'కాశిలో మరణించువారికి ముక్తి' యను శ్లోకార్థ మిక్కడ వర్తించును.

78. ఈ శ్లోకములో వచింపబడిన కాశియే ఆజ్ఞాచక్రము.

79. అక్కడి మరణమనగా రుద్రగ్రంధి భేదనము. (మరణము గ్రంధికి చెందును).

80. కపాల భేదశ్చ ప్రాగుక్తో గ్రంథిభేద సాపేక్షః।

81. యోఽన్తరిక్షే న్మహతీం శక్తిమిచ్ఛతి స ప్రచండచండికా ముపాసీత।
82. తన్మంత్రే ప్రణవః ప్రథమం బీజమ్।
83. శ్రీ ర్ద్వితీయమ్।
84. మాయా తృతీయమ్।
85. వాక్తురీయమ్।
86. సప్తాక్షరస్య తన్నామ్నః సంబోధనమ్ తతః।

87. తతః కూర్చ ద్వయమ్।
88. అథాస్త్రమ్।
89. శిరోఽన్తే।
90. అనయా విద్యయా నాస్తి కించి దసాధ్యమ్।
91. కూర్చ మంత్రేణవా।

92. అథాస్యాః శుద్ధముపాసనమ్।
93. అంతరూష్మాణం విచింతయేత్।
94. అత్ర విచింతనే క్రోధముద్రా భవతి।
95. అన్వేషణ ముద్రావా।
96. దుఃఖ ముద్రావా।

97. లక్ష్యం మూలాధారే।

80. పూర్వము చెప్పబడిన కపాలభేదన మీరుద్రగ్రంథి భేదనము నపేక్షించి యుండును.
81. అంతరిక్షమునుండి మహాచ్ఛక్తిని గోరువాడు ప్రచండ చండిక నుపాసించవలెను.
82. ఆ మంత్రమందు మొదటి బీజము ప్రణవము ఓం.
83. రెండవది శ్రీ బీజము శ్రీం.
84. మూడవది మాయా బీజము హ్రీం.
85. నాల్గవది వాగ్బీజము ఐం.
86. అటుపిమ్మట సప్తాక్షరియగు దేవీ నామముయొక్క సంబోధనము 'వజ్రవైరోచనీయే'.
87. తరువాత కూర్చ బీజ ద్వయము హూం హూం.
88. పిమ్మట అస్త్రము ఫట్.
89. అంత్యమందు శిరస్సు స్వాహా. { ఓం శ్రీం హ్రీం ఐం వజ్రవైరోనీయే హూం హూం ఫట్ స్వాహా.
90. ఈ మంత్రవిద్య కసాధ్యమైనది లేదు.
91. 'హూం' అను కూర్చమంత్రముతో (అనగా బీజముతో) నైన నుపాసింపవచ్చును. (''రాయస్కామో. వజ్రహస్తం సుదక్షిణం పుత్రోనపితరం హువే'' అను వేదమంత్రము పశ్చాత్పూరో నాడులు రెండింటికి జెందు కూర్చ మంత్రముగా గణింపబడును. కవికీ మంత్రదర్శనమైనట్లు కవిచరిత్రనుండి తెలియును. కనుక దానిని సూచించినట్లు గ్రహించినను దోషముండదు.)
92. ఇంక శుద్ధోపాసన మెట్లనగా.
93. అంతరూష్మాణమును చింతించుట.
94. అట్లు చింతించుటయందు క్రోధముద్ర కావచ్చును.
95. లేదా అన్వేషణ ముద్ర.
96. లేదా దుఃఖముద్ర (ఈ మూడు ముద్రలయందును చింతించు మనస్సున కేకాగ్రత కల్గును.)
97. లక్ష్యము మాత్రము మూలాధారమందే.

98. జ్యోతిర్విద్యోపనిషత్సు సేయం గీయతే।
99. అంతరిక్షా దాత్మని ప్రవహంతీం శక్తింవా ధ్యాయేత్।

100. అత్ర శరీర సమర్పణ ముద్రా।
101. ఆదౌ భావయేత్।
102. కాలేనానుభవతి।
103. అంతరూష్మానుభవశ్చాత్మానుభవా న్నాతిరిచ్యతే।
104. స్పర్శానుభవ ఏషః।

105. దర్శనానుభవోఽపరః।

---

## సప్తమః ధూమావతీ పటలః

1. ధూమావతీం వ్యాఖ్యాస్యామః।
2. సప్తమీ ధూమావతీ దశసు మహావిద్యాసు।
3. యయా నాత్మనోఽన్యద్వ్యజానా త్పరమః సా యోగనిద్రా ప్రలయకాలికీ ధూమావతీ।
4. సర్వకాలానుబంధినీ త్యేకే।

5. ముక్తానాంచ నిత్యానంద నిద్రా।
6. సంసారిణాంతు నిద్రా, మూర్ఛా, విస్మృతిశ్చ।

7. అవిద్యాచ యయా సంసారిణో నాత్మానం జానతే।

8. అవిద్యా మాయాతో విలక్షణా।
9. యయైకం బహుధా పశ్యంతి సా మాయా।

98. దీనినే జ్యోతిర్విద్యయని యుపనిషత్తులందు గానము చేసిరి.
99. అంతరిక్షమునుండి మనయందు ప్రవహించుచున్న శక్తినైన (శుద్ధోపాసనకొఱకు) ధ్యానించవచ్చును.
100. ఆ సాధనలో శరీరసమర్పణముద్ర యగుచున్నది.
101. ఆదియందా ముద్రను భావించవలెను.
102. కాలక్రమమున నది యనుభవసిద్ధమగును.
103. అంతరూపాత్మానుభవ మాత్మానుభవముకంటె భిన్నముకాదు.
104. అంతరూపాత్మానుభవ మాత్మయొక్క స్పర్శానుభవము. (పరోక్ష జ్ఞానము నిచ్చునది).
105. రెండవది యాత్మయొక్క దర్శనానుభవము. (ప్రత్యక్షజ్ఞానము నిచ్చునది).

---

# 7. ధూమావతీ పటలము

1. ధూమావతిని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. ధూమావతి దశమహావిద్యలలో నేడవది.
3. ఏది యాత్మకంటె నుత్కృష్టమైనదేదియు లేదని తెలియ జేయుటకగునో, అట్టిప్రళయకాల యోగనిద్రయేధూమావతి.
4. ఒక్క ప్రళయకాలమునకేగాక సర్వకాలముల కనుబంధిని యీామెయని కొందఱనిరి. (ఎట్లనగా),
5. ముక్తపురుషులయందీమె నిత్యానంద నిద్రయగుచున్నది.
6. సంసారమందు జిక్కుకొనిన వారియందు నిద్ర, మూర్ఛ, మఱపు రూపములతో నున్నది.
7. ఏ యజ్ఞానమువలన సంసారు లాత్మను తెలియజాలకున్నారో, ఆ యవిద్యారూపిణిగాకూడ నున్నది.
8. మాయకంటె వేఱైనది యవిద్య.
9. ఏకమైయున్న ఆత్మను బహువిధములుగా జూపునది మాయ.

10. యయా సంతం నపశ్యంతి సా త్వవిద్యా।

11. దేవ్యా నిద్రా - భ్రాంతి రూపత్వం పౌరాణికే దేవీసూక్త ఉక్తమ్ ।

12. ఇయమేవ రాత్రిర్దేవీ వేదేఽభిధీయతే ।
13. 'హ్వాయామి రాత్రిం జగతో నివేశనీ' మితి మంత్రవర్ణోఽత్ర భవతి ।
14. ఇయమేవ దేవ్యాద్యం తమ ఉచ్యతే।
15. 'తమ ఆసీత్తమసా గూహ్ల మగ్ర' ఇతి మంత్రవర్ణోఽత్ర భవతి।

16. తమో రూపత్వా దియం ధూమావతీ।
17. ఆద్యత్వాత్ జ్యేష్ఠా ।

18. అధిదైవతం వరుణానీ ।

19. విశ్వోచ్చాటన కామో ధూమావతీ ముపాసీత ।

20. ద్విరనంత ధూమసహితేన శిరోంతేన సంబోధనేన ।
21. శుద్ధ ముపాసనం వ్యతిరేకేణైవ భవతి ।
22. నాన్వయేన ।
23. సర్వ సంకల్పత్యాగే నేత్యుక్తం భవతి ।
24. తదేవ మహామౌనమ్ ।
25. సంకల్పేన పూర్ణే కిమపి నాంతరం కుర్యాత్ ।

26. అంతరకారిణో భయం శ్రూయతే ।

10. ఎల్లప్పుడు నున్న ఆత్మ స్థితిని మఱుపుజేసి యసత్తునం దాత్మ భ్రాంతినిచ్చునది యవిద్య.
11. పౌరాణిక దేవీసూక్తములో ధూమావతికి పైని వివరింపబడిన నిద్రా భ్రాంతి రూపత్వములు రెండును వర్ణింపబడెను. (అనగా నీ రెండింటిని యధిష్ఠించి వానిని గల్పించు దేవత యని భావము).
12. ఈమెనే రాత్రియను దేవతగా వేదము తెల్పుచున్నది.
13. 'జగత్తునకు నివేశమగుచున్న రాత్రి నాహ్వానింతు'నని చెప్పు మంత్రవర్ణ మిక్కడ ప్రమాణము.
14. ఆదిమ తమస్సే యీమెయనియు చెప్పబడెను.
15. 'తమ ఆసీత్తమసా గూఢ్హ మగ్ర' మను మంత్రవచన మందులకు ప్రమాణము.
16. తమోరూపత్వముచే నీమె ధూమావతి యనబడెను.
17. మొదటి తమస్సగుటవలన జ్యేష్ఠ యనబడెను. (అనగా నవిద్యను గల్పించునది. ఆత్మను మఱపించు నవిద్యజనించిన పిమ్మటనే నిద్రాది యితర తమస్సు లావరించును)
18. ఈ విద్య కధిదేవత వరుణాని (అనగా రాత్రి కధిష్టానదైవమగు వరుణుని భార్య.)
19. విశ్వోచ్చాటనము జేయగోరువాడు (విశ్వమును స్మృతినుండి పాఱద్రోల దలచినవాడు) ధూమావతి నుపాసించవలెను.
20. 'ధూం ధూం ధూమావతి స్వాహా' యను మంత్రముచేత.
21. శుద్ధోపాసన మిందులకు వ్యతిరేకముగా నుండును.
22. మంత్రమున కన్వయము కాజాలదు (శుద్ధోపాసనము).
23. సర్వ సంకల్పత్యాగమును బేర్కొనుచున్నది.
24. అదియే మహామౌనము.
25. పూర్ణమైన అనుభవమున కేమాత్రమంతరాయము సంకల్పముచే గల్పించరాదు.
26. అంతరాయమువలన భయము కల్గునని విశ్రుతము.

27. ఇయం భూమవిద్యే త్యుపనిషది గీయతే।

28. తత్రహి జ్ఞేయాంతర నిషేధః ।
29. అత్రైవ విద్యావిద్యయోః సముచ్చయః ।
30. కేవలా త్వవిద్యా నిషిద్ధా నిద్రాదిః।
31. తదంధం తమః ।
32. కేవలా విద్యాతు నిషిద్ధా విషయజ్ఞానాత్మికా ।
33. తధ్భూయోంధం తమః ।

34. సముచ్చయేన విద్యావిద్యే ఉపాస్యే।

35. విద్యాచ పూర్ణా స్వతస్సిద్ధా ।

36. అవిద్యాచ విషయాణామ్ ।

37. విషయాఽవిద్యయా మృత్యుం తీర్త్వా ।
38. పూర్ణ విద్యయాఽమృత మశ్నుతే ।

39. విషయాఽవిద్యయైవ పూర్ణవిద్యా భాసేత ।

40. ఏవ మవిద్యాపి విషయాణాంచే న్ముక్తిదా భవతి ।

---

27. ఈ శుద్ధోపాసనమును భూమవిద్యగా నుపనిషత్తులు గానము చేసెను.

28. ఇతర జ్ఞేయభూత ముపనిషత్తులందును నిషేధింపబడెను.

29. వానియందింకను విద్యావిద్యల సముచ్చయము విధింపబడెను.

30. కేవల నిద్రాదులకు జెందు నవిద్య నిషిద్ధమైనది.

31. అది యంధకారమగు తమస్సు కనుక.

32. కేవల విషయజ్ఞానాత్మిక విద్యయు నిషిద్ధమైనదే.

33. అది మఱియు నంధకారమగు తమస్సు గనుక. (ఆత్మను విశ్వమునుగూడ మఱపించునది మొదటిది. ఆత్మను మఱపించి యూరకుండక అనాత్మతో క్రీడించునది లేదా అనాత్మయం దాత్మభ్రాంతి నిచ్చునది రెండవది.)

34. ఈ విద్యావిద్యలను సముచ్చయముగా (కలిపి) నుపాసించవలెను.

35. (విషయముల నెఱుగుటకుగాక) పూర్ణమై స్వతస్సిద్ధమై యున్న ఆత్మ నెఱుగుటకగు విద్యచేతను (తెలివి నాత్మశోధనకై వినియోగించుటయు)

36. విషయములం దవిద్యనుంచుటవల్లను (విషయములు మఱపగుటకవిద్యను విషయపరముమాత్రముచేసి, విద్యచే విషయములనుగాక ఆత్మను మాత్ర మెఱుగుచుండుట యీ సముచ్చయమందు విధానము.)

37. విషయములవంక నవిద్యచే (విషయసంబంధమగు) మృత్యువుదాటి.

38. పూర్ణవస్తువువైపుననుండు విద్యచే (పూర్ణవస్తు సంబంధమగు) నమృతత్వమును (అనగా శాశ్వతత్వమును) బొందవలెను.

39. అప్పు డవిద్య విషయసంబంధమైనదియైనను (సముచ్చయత్వముచే) పూర్ణవస్తువునకు జెందు విద్యగా బ్రకాశించును.

40. ఈ విధముగా ధూమావతి యవిద్యారూపిణియైనను విషయముల నుండి (తత్కాల విస్మృతినిగాక) విముక్తినే కలిగించును.

# అష్టమః బగళాముఖీ పటలః

1. బగళాముఖీం వ్యాఖ్యాస్యామః ।
2. అష్టమీ సా దశసు మహావిద్యాసు ।
3. స్తంభనశక్తి ర్బగళాముఖీ ।
4. అధ్యాత్మం సా శంఖిన్యాం నాడ్యాం ।
5. అధిలోకం పితృయాణే పథి ।
6. దండనాథా కాచన మధ్యమాయా అధిదైవతమ్ ।
7. రిపు స్తంభన కామో బగళాముఖీ ముపాసీత ।

8. అంతశ్శత్రు స్తంభన కామోవా ।
9. ఖేంద్రాగ్ని శాంతి చంద్రైః సంయుక్తైః ।
10. శుద్ధముపాసన మింద్రయోని విద్యయా ।
11. ఇంద్రయోనిశ్చ జిహ్వామూలే లంబమానం తైజసలింగమ్ ।

12. తల్లక్ష్య ధ్యానం తద్విద్యా ।
13. అంతర్వాయు సంచార నిరోధేనవా ।

14. తం హఠయోగ మాహుః ।
15. యో వాయుం స్తంభయేత్ స సర్వం స్తంభయేత్ ।

---

# 8. బగళాముఖీ పటలము

1. బగళాముఖిని గురించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో నెనిమిదవది.
3. స్తంభనశక్తియే బగళాముఖి.
4. అధ్యాత్మమందామె శంఖినీ నాడియందుండును.
5. అధిలోకమందు పితృయానమను మార్గమందుండును.
6. మధ్యమయొక్క యొకానొక దండనాథ యీవిద్య కధిదైవతము.
7. శత్రువులను స్తంభింపజేయ గోరువాడు బగళాముఖి నుపాసించవలెను.
8. అంతశ్శత్రువులైన కామక్రోధాదులను స్తంభింపగోరువాడును.
9. 'హ్లీం' అను నేకాక్షరమంత్రముచే నుపాసించవలెను.
10. శుద్ధోపాసన మింద్రయోని విద్యచే చేయవలెను.
11. ఇంద్రయోని యనగా జిహ్వామూలమందు వ్రేలాడు తైజస లింగము (దీనినే కొండనాలుక యందురు లేదా ఉపజిహ్వా)
12. దానియందు లక్ష్యముంచి ధ్యానించుటయే దానివిద్య.
13. లేదా, లోపల వాయుసంచారమును నిరోధించుటయు శుద్ధోపాసనమే.
14. దానిని హఠయోగమందురు.
15. ఎవడు వాయువును స్తంభించునో వాడు సర్వమును స్తంభింపజేసినవాడగును.

---

# నవమః మాతంగీ పటలః

1. మాతంగీం వ్యాఖ్యాస్యామః ।
2. నవమీ సా దశసు మహావిద్యాసు ।
3. సామాన్యతః తారాయా స్తత్త్వేన మాతంగ్యాస్తత్త్వం వ్యాఖ్యాతమ్ ।
4. అధిదైవతైక్యేపి కించిత్తత్త్వభేదాత్ విద్యా భేదః ।
5. తత్రావ్యక్తః శబ్దస్తత్త్వమ్ ।
6. అత్ర వ్యక్తః ।
7. మంత్రిణీ మధ్యమాయా మాతంగ్యధిదైవత మిత్యేకే ।
8. భైరవీ పరావాక్ ।
9. తారా పశ్యంతీ ।
10. మాతంగీ వైఖరీ ।
11. తాభీ రుద్రబ్రహ్మణస్పత్యగ్నీనా మల్పోభేదో వ్యాఖ్యాతః ।
12. మధ్యమా వాక్ మాతంగీత్యేకే ।
13. వైఖరీ మధ్యమయోరేకం తత్త్వమిత్యవిప్రతిషేధః ।
14. బ్రహ్మణస్పతి ర్బృహస్పతి•రిత్యనర్థాంతరమ్ ।
15. తారాయాః శుద్ధోపాసనేన మాతంగ్యాః శుద్ధోపాసనం వ్యాఖ్యాతమ్ ।

# 9. మాతంగీ పటలము

1. మాతంగిని గురించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో తొమ్మిదవది.
3. సామాన్యముగా 'తారా' తత్త్వముచే మాతంగీ తత్త్వము వ్యాఖ్యానమైనదగును.
4. అధిదైవతమం దైక్యమున్నను స్వల్పతత్త్వభేదమువలన విద్యాభేదమయ్యెను.
5. తార కవ్యక్త శబ్దము తత్త్వము (అనగా నవ్యక్త ప్రణవము).
6. మాతంగికి వ్యక్త శబ్దము తత్త్వము (వ్యక్తప్రణవము).
7. 'మధ్యమ'యొక్క మంత్రిణి యీ మాతంగీవిద్య కధిదైవతమని కొందఱందురు.
8. భైరవి పరావాక్కగును.
9. తార పశ్యంతీ వాక్కగును (అవ్యక్తశబ్దము).
10. మాతంగి వైఖరీ వాక్కగును (వ్యక్తశబ్దము).
11. ఈ మూడింటివలన రుద్రబ్రహ్మణస్పత్యగ్ని దైవములకు గల స్వల్పభేదములు వ్యాఖ్యానమైనవి (ఈ మూడును శబ్ద దైవములే).
12. మధ్యమా వాక్కును కొందఱు మాతంగి యందురు.
13. వైఖరీ మధ్యమా వాక్కులయొక్క తత్త్వమొక్కటియే గనుక విరోధము లేదు (మాతంగిని మధ్యమా వాక్కనుట).
14. (అట్లే) బ్రహ్మణస్పతియు బృహస్పతియు నొక్కరే.
15. (కనుక) తారయొక్క శుద్ధోపాసనచే మాతంగియొక్క శుద్ధోపాసనము వ్యాఖ్యానమయ్యెను. (వ్యక్తశబ్దమునకు వెనుక

16. మంత్రేఽస్తి విశేషః ।

17. వాణీ హృదయ మమరేశ్వరః సవిద్యోయుక్తో తాలవ్యాద్య
నన్తర స్పర్శోయుక్తో మూర్ధన్యాది స్పర్శోష్మాణౌ సశేషః
కచ్ఛపేశః శుండాన్త్యం సవిద్య ఇంద్రః సశేషః సూర్యో
హరి రనునాసిక పూర్వః సవిద్యో గణపతి ర్భృగు రగ్ని
జలే సంయుక్తే జలం బకోనునాసిక పూర్వో బ్రహ్మ
సవిద్యోగ్నిః శిర ఇతి తన్మంత్రః ।

నుండు మధ్యమ నాదమును పరిశోధించు సాధనము రెండింటి యందును శుద్ధోపాసనమగును).

16. మంత్రమందు మాత్రము విశేషమున్నది.

17. 'ఐం నమ ఉచ్ఛిష్ట చాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా' అనునది మంత్రము. వాణీ=ఐం; హృదయం=నమ; అమరేశ్వరః=ఉకారము; స విద్యా తాలవ్యాద్యనన్తరస్పర్శౌ యుక్తౌ=విద్యాబీజమగు 'ఇ'కారముతో గూడిన తాలవ్యాది స్పర్శ మనగా తాలవర్గములోని మొదటి హల్లగు 'చ'కారమున్ను, తదనన్తర స్పర్శ (హల్లు) యైన 'ఛ'కారమున్ను యుక్తౌ (కలుపగా) – 'చ్ఛి' యగును; మూర్ధన్యాది స్పర్శః, ఉష్మాణౌ(ష)యుక్తౌః='ష'కార 'ట'కారములు కలుపగా వచ్చు 'ష్ట' యగును; స శేషః, కచ్ఛపేశః, శుండాన్త్యః='ఆ'కారముతోగూడిన 'చ'కారమున్ను, శుండాపదములో నన్త్యమగు 'ండా' యున్ను – అనగా 'చాండా' అగును; స విద్యః ఇంద్రః='ఇ'కారముతోగూడిన ఇంద్రబీజమగు 'ల' కారమనగా 'లి' అగును; స శేషః సూర్యః='ఆ'కారముతో గూడిన సూర్యబీజమగు 'మ'కారమనగా 'మా' అగును; హరిః=త; అనునాసిక పూర్వః స విద్యో గణపతిః=పూర్వమందనునాసికగల విద్యాబీజమైన 'ఇ'కారముతోగూడిన గణపతి బీజమగు 'గ'కారము – అనగా 'ంగి' అగును; భృగుః=స; అగ్ని జలే సంయుక్తే='ర'కార, 'వ'కార సంయుక్తము 'ర్వ' అగును; జలం=వ; బకః, అనునాసిక పూర్వ బ్రహ్మ = బక బీజమగు 'శ'కారము, అనునాసికము పూర్వమున్న బ్రహ్మ బీజమగు 'క'కారము – అనగా 'శంక' అగును; స విద్యోగ్నిః= 'ఇ'కారముతో గూడిన 'ర'కార మనగా 'రి' అగును, శిరః=స్వాహా.

18. తారోపాసన ఫలేన తదుపాసనఫలం వ్యాఖ్యాతమ్ ।

18. తారోపాసన ఫలముచే మాతంగ్యోపాసన ఫలము వ్యాఖ్యాన మైనదిగా నెంచవలెను.

పరా:—పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కులను గుఱించి శ్రీ వాసిష్ఠ గణపతిముని యొకప్పు డుపన్యసించుచు నొసగిన వివరణ మీ దిగువ సంగ్రహముగా నీయబడుచున్నది:—

పరావాక్కు:—ఇది యవ్యక్త ప్రణవము, శుద్ధాకాశ మనబడును. ఇది శక్తి కభిన్నము, అవికారి, నిత్యమైనది, ముక్కులరహస్యవేది, ఆత్మానుభూతి నిచ్చునదియై యుండును. విషయములన్నియు దీనియం దనుభవవాసనరూప మున నిమిడి లీనమై యుండును. ఋషులు దీనియందే లయమును సాధించి జ్ఞానము బడసిరి. ఏ జ్ఞానము వారు పొందగల్గిరో, అదియే పశ్యంతీరూప ముగా దర్శనమగుటకు వారియందు బరిణమించెను.

పశ్యంతీవాక్కు:—పరావాక్కు త్రిరూపాత్మకమై యుండి పరిణామదశయందు రూపత్రయ మగుచున్నది. ఆ రూపత్రయ పరిణామములో మొందటిది పశ్యంతీ, రెండవది మధ్యమా, మూడవది వైఖరీ. తేజస్స్వరూపమగు పరా వాక్కునుండి యుద్భవించు నీ మూడును తేజోమయములే. వీనిలో పశ్యంతీ వాగ్రూప మంతర్విషయములను గ్రహించునదియై, వానిని (ప్రపంచవాసన లను) తనలో ప్రత్యేకముగా ధరించును — అనగా నెన్ని పరిణమింప వలెనో అన్నింటిని గ్రహించి ధరించును గావున పరావాక్కు సంవిత్తనచో ఇది విద్యుత్తగును. దీనికి చూచు శక్తి యుండును. బుద్ధిలో శిరస్సునం దిది కూడి వ్యవహరించును.

మధ్యమావాక్కు:—ఆకాశమం దిది చరియించుచు సమష్టిగానే యున్నను, సమయము ననుసరించియు వ్యష్టియొక్క గ్రహణోపాధి ననుసరించియు సువ్యక్తమగుచుండును. దీనినే గణపతి యందురు. జపము చేయునపుడు నాద శక్తి యీ సమష్టిరూపమునుబొంది యాకాశమందు నశించక యుండును. అది తిరుగవలయువారి కుపకరించుచుండును గావున సంఘజపముయొక్క ఫలము వ్యాఖ్యాతము కాగలదు. సూర్య చంద్రగ్రహణ సమయముల యందొనర్చు జపమున కిదియే ఫలము.

వైఖరీవాక్కు:—ఇది యింద్రియ సంబంధము, జగన్ముఖము. దీని నాంతర్యమునకు మరలించినప్పుడు గజముఖమగును (అనగా తిరుగబడిన 'జగ' ముఖము.).

---

# దశమః కమలాత్మికా పటలః

1. కమలాత్మికాం వ్యాఖ్యాస్యామః।
2. దశమీ సా దశసు మహావిద్యాసు।
3. కమలైవ కమలాత్మికా।
4. సుందర్యా స్తత్త్వేన కమలాత్మికాయా స్తత్త్వం వ్యాఖ్యాతమ్।
5. సుందర్యాః శుద్ధోపాసనేన కమలాత్మికాయాః శుద్ధోపాసనం వ్యాఖ్యాతమ్।
6. తత్త్రైవక్యేప్యధిదైవత భేదాత్ విద్యాభేదః।
7. తత్ర మధ్యమస్యపత్నీ దేవతా।
8. అత్ర తూత్తమస్య।

9. అస్యా అపి మంత్రః శ్రీవిద్యోచ్యతే।
10. ప్రథమోష్మాగ్ని శాంతి చంద్రైః సహితైః సభవతి।
11. అనయా కమలాత్మికా ముపాసీత మోక్షకామః।
12. వైభవ కామోవా।
13. ఇతి దశమహావిద్యా స్తంత్ర సారభూతాః।
 తదే తత్పాద శతోనే నార్ధసహస్రేణ సూత్రాణాం మహావిద్యా వివరణం భవతి।

---

ఇతి శ్రీ భగవన్మహర్షి రమణాన్తే వాసినో వాసిష్ఠస్య నరసింహసూనోః గణపతి మునేః కృతిః దశమహావిద్యాసూత్రం సమాప్తమ్.

# 10. కమలాత్మికా పటలము

1. కమలాత్మికను గురించి వ్యాఖ్యానించెదము.
2. ఆమె దశమహావిద్యలలో పదియవది.
3. కమలయే కమలాత్మిక. (లక్ష్మి)
4. సుందరీ తత్త్వముచే కమలాత్మికా తత్త్వము వ్యాఖ్యానమయ్యెను.
5. సుందరియొక్క శుద్ధోపాసనచే కమలాత్మికయొక్క శుద్ధోపాసనము వ్యాఖ్యానమైనట్లగును.
6. తత్త్వములందీ విద్యలు రెండింటి కైక్యమున్నను, నధిదేవతా వ్యత్యాసముచేత విద్యలు వేఱయ్యెను.
7. సుందరీవిద్యలో దేవత మధ్యముని పత్ని యయ్యెను.
8. ఇక్కడ దేవత యుత్తమునిపత్ని యగుచున్నది. (కనుక హృత్కమలాత్మికగా నీమె నెంచవలెను. అప్పుడు సహస్రారాధిష్ఠాన సుందరికి నీమెకు గల నధిదేవతాతత్త్వభేదము విశదమగును.)
9. ఈమెయొక్క మంత్రముకూడ శ్రీవిద్య యనబడును.
10. 'శ్రీం' అను నేకాక్షరమే మంత్రము.
11. మోక్షకాము డీ మంత్రముచే కమలాత్మిక నుపాసించవలెను.
12. వైభవము నపేక్షించువాడును.
13. ఇట్లు తంత్రసారభూతములగు దశమహావిద్యలు (ముగిసెను). ఇవి 475 సూత్రములచే నిబద్ధమై, మహావిద్యా వివరణమగుచున్నవి.

---

(ఉత్తర పంచకముకూడ ముగిసెను. మనయందాత్మస్మృతి యితరస్మృతుల కాశ్రయము. ఆత్మస్మృతియే 'అహమ్మహ' మ్మను ప్రత్యేకలక్షణము. ఇది శబ్దముగను జ్ఞానముగను స్ఫురించుచున్నందున దీనికి కారణభూతమగు క్రియాజ్ఞానశక్తులు, స్ఫురణలక్షణమైన ఆకాశము పూర్వపంచకమందు వచింపబడెను. ఇతరస్మృతులకు మూలమైన స్మృతిని శోధించువానియొక్క మనస్సు తపోలక్షణము బొందును. దాని ననుగ్రహించు దేవతాతత్త్వమునే యుత్తరపంచకమునుండి గ్రహింపదగును.)

ఇట్లు శ్రీ భగవన్మహర్షి రమణాంతేవాసియు, వాసిష్ఠనరసింహునిపుత్రుడును అగు గణపతిమునిచే రచింపబడిన దశమహావిద్యాసూత్రగ్రంథము సమాప్తము.

# మహా విద్యాది సూత్రావళి

## ద్వితీయ భాగము

### అన్యసూత్ర గ్రంథాష్టకము

1. గాయత్రీ వ్యాఖ్యాన సూత్రము.
2. యోగ వ్యాఖ్యాన సూత్రము.
3. సీతా వ్యాఖ్యాన సూత్రము.
4. కృష్ణ వ్యాఖ్యాన సూత్రము.
5. రుద్రకుటుంబ సూత్రము.
6. ఇంద్రేశ్వరాభేద సూత్రము.
7. సృష్టి సూత్రము.
8. రాజయోగసార సూత్రము.

# గాయత్రీ వ్యాఖ్యానమ్

1. గాయత్రీం సావిత్రీం వ్యాఖ్యాస్యామః ।
2. యయా విప్రాణాం ద్వితీయం జన్మకిల భవతి సంస్కృతానామ్ ।
3. జ్ఞానశక్తేః సావిత్రీ నాతిరిచ్యతే ।
4. సవితుర్హిరణ్యగర్భస్యేయం శక్తి రితి ।
5. తాం గాయత్ర్యా సముపాసతే ।
6. యాం మహతా తపసా దదర్శ భగవాన్విశ్వామిత్రో మహర్షిః ।
7. గాయత్ర్యా స్సవితాదేవతేతి శ్రుతే రనుక్రమణికా వచనాచ్చ మన్త్రస్య పురుషో దేవతేతి కేచిన్మన్యంతే ।
8. పురుషశ్చ మణ్డలాన్తర్వర్తీ ।
9. న మణ్డల మాత్రమ్ ।
10. య ఏషోన్తరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యత ఇతి శ్రుత్యా నిరూపితః సః ।
11. ధ్యేయస్సదా సవితృ మణ్డల మధ్యవర్తీ నారాయణ ఇతి ప్రాచాం ధ్యానశ్లోకోత్ర సమర్థకో భవతి ।
12. ముక్తా విద్రుమేత్యాది ధ్యానశ్లోకా త్ప్రసిద్ధా న్నారీత్యపరే ।
13. గాయత్రీ సావిత్రీ సరస్వతీతి స్త్రీలింగ నిర్దేశేభ్యశ్చ ।
14. మన్త్రలింగస్తు భర్గసో ధ్యేయత్వ నిర్దేశా న్నపుంసక పరమ్ ।

# గాయత్రీ వ్యాఖ్యానము

1. గాయత్రీ సంబంధమైన సావిత్రీ విద్యను వ్యాఖ్యానించెదము.
2. దేనిచే సంస్కరింపబడినప్పుడు విప్రులకు ద్వితీయజన్మ గల్గున ట్లెంచబడునో (ఆవిద్యను).
3. జ్ఞానశక్తి కంటె సావిత్రి వేఱుకాదు.
4. ఈమె సవితుని హిరణ్యగర్భ శక్తి యని ప్రసిద్ధి.
5. ఈమెను గాయత్రీ మంత్రముచే నుపాసింతురు.
6. ఏ మంత్రమును భగవాన్ విశ్వామిత్ర మహర్షి మహత్తర తపస్సుచే దర్శించెనో.
7. గాయత్రీమంత్రమునకు దేవత సవితయని శ్రుతియు అనుక్రమణి కయుకూడ చెప్పుచున్నందున కొందఱు పురుషుడు దైవమని తలచుచున్నారు.
8. పురుషుడైనచో మండలాన్తర్వర్తి.
9. మండల మాత్రుడు కాడు.
10. 'ఆదిత్యమండలాంతర్యామం దగపడు హిరణ్మయపురుషుడే అతడు' అని చెప్పిన శ్రుతిచే నీ పురుషుడే నిరూపించబడెను.
11. 'ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణ...' అను ప్రాచీన ధ్యానశ్లోకముకూడ నిక్కడ సమర్థించుట కగును.
12. కాని కొందఱు 'ముక్తావిద్రుమ...' అను ప్రసిద్ధ ధ్యానశ్లోక ముచే స్త్రీరూపిణిగా (మండలాన్తరమందున్న దానిని) తలచు చున్నారు.
13. గాయత్రీ, సావిత్రీ, సరస్వతీ యను పదములు స్త్రీలింగ నిర్దేశ ములగుట వల్లను అట్లు తలచుచున్నారు.
14. మంత్రలింగమునుబట్టి ధ్యేయవస్తువుగా నిర్దేశించబడిన 'భర్గస్' అను పదము నపుంసక లింగపరము.

15. వస్తుతస్తు నస్త్రీ।
16. న పుమాన్ ।
17. న నపుంసకమ్ ।
18. సర్వలింగాపేతమ్ యంత్కించిద్వస్తు।
19. తస్య సర్వైర్లింగైః శాస్త్రే వ్యవహారో దృశ్యతే।
20. సదేవ సోమ్యేతి నపుంసకేనారంభే ।
21. అనేన జీవేనాత్మనేతి పుంలింగేన మధ్యే ।
22. తేజః పరస్యాం దేవతాయా మితి స్త్రీలింగేనాంతతః ।
23. హిరణ్మయ పురుషాకృతి సంబన్ధాత్ తస్య పురుషత్వేన ధ్యానమ్ ।
24. శక్తి రూపతయా స్త్రీత్వేన ।
25. గాయత్రీ చ ఛందః ।
26. న దేవతా ।
27. ఛందసి దేవతా దృష్టిః కేవలా భావనా ।
28. కేషాంచిత్సవితు రితి షష్ఠీ ధర్మి పరా ।
29. భర్గ ఇతి ద్వితీయా ధర్మపరా ।
30. తన్మతే సవితా జ్ఞాతా ।
31. భర్గో జ్ఞానశక్తిః ।
32. కేషాంచి చ్ఛరీర పరా షష్ఠీ ।
33. శరీరి పరా ద్వితీయా ।
34. తన్మతే సవితా హిరణ్మయపురుషాకృతిః ।

15. అది వస్తుతః స్త్రీయు కాదు.
16. పురుషుడును కాదు.
17. నపుంసకమును కాదు.
18. సర్వలింగాపేతమైన నొకానొక వస్తువది.
19. దాని కన్ని లింగములతోడను శాస్త్రమందు వ్యవహార మగపడు చున్నది.
20. 'అది సద్వస్తువే, ఓసోమా (శిష్యా)' యని నపుంసకలింగముతో నారంభించెను (ఛాందోగ్య శ్రుతి).
21. 'అనేన జీవేనాత్మనా...' అని శ్రుతి వాక్య మధ్యయందు పుంలింగపరమగుచు,
22. 'తేజః పరస్యాం దేవతాయాం' అని స్త్రీలింగపరముగా నంత మగుచున్నది.
23. హిరణ్మయ పురుషాకృతి సంబంధమున్నందున దానికి ధ్యానము పురుషపరముగను.
24. శక్తిరూపముగా నున్నందున స్త్రీపరముగను చెప్పబడెను.
25. గాయత్రీ యనునది ఛందస్సు మాత్రమే.
26. దేవత కాదు.
27. ఛందస్సునందు దేవతాదృష్టి కేవల భావనామాత్రము.
28. కొందఱు 'సవితుః' అను షష్ఠీవిభక్తికలది 'ధర్మి' పరమనియు.
29. 'భర్గః' అను ద్వితీయ విభక్తికలది 'ధర్మ' పరమనియు తలతురు.
30. వారి మతములో సవితుడు జ్ఞాత (ధర్మి) యగును.
31. భర్గస్ జ్ఞానశక్తి యగును (ధర్మః).
32. మఱికొందఱు షష్ఠీవిభక్తితోగూడిన సవితుని శరీరపరముగను.
33. ద్వితీయ విభక్త్యంతమగు 'భర్గః' శరీరి పరముగను (ధర్మి ధర్మములను మార్చి) చెప్పిరి.
34. వారి మతములో సవితశబ్దము హిరణ్మయపురుషాకృతికి జెందును (అనగా మండలమునకు)

35. భర్గస్తదన్తరభూతం వస్తు ।
36. పరేషాం షష్ఠీ ద్వితీయయోరేకార్థత్వమ్ ।

37. రాహోః శిర ఇతివత్ ।
38. చిదేవ సోఽర్థః ।

39. ద్వితీయ మర్థమృజుం మన్యతే వాసిష్ఠః ప్రకరణాత్ ।

40. ప్రథమంవా హిరణ్మయ పురుషాకృతి సంబంధాఽత్యాగేన ।

41. మాన్త్రవర్ణిక ఉత్తరోఽర్థశ్చ ఆధ్యాత్మికః ।
42. అముష్యోద్దేశేనాస్య ధ్యాన ముపదిష్టం భవతి ।

43. ధీ మూలాన్వేషణం ధ్యానప్రకారః ।
44. యథా లక్షణం ధ్యేయత్వాత్ ।

45. అత్రాముష్య దృష్టిరుత్కర్షాత్ ।
46. ఆగమానాం సార ఆసురీగాయత్రీ పంచదశాక్షరీ మధ్యమస్య జ్ఞానశక్తిః ।

47. నిగమానాం సార ఆర్షీగాయత్రీ సావిత్రీ ।

48. ఇతి సప్తచత్వారింశతా సూత్రాణాం గాయత్రీవ్యాఖ్యానంభవతి.

---

35. 'భర్గః' శబ్దము తదంతరభూతమైన వస్తువునకు జెందును.
36. ఇంకొక వర్గమువారు సవిత, భర్గ పదము లేకార్థదాయకము లందురు.
37. 'రాహువుయొక్క శిర' స్సనినట్లు.
38. వారి భావమేమనగా సవిత భర్గులుభయులకు స్వరూపము చిత్తే కనుక భేదము లేదని.
39. పై మూడు మతములలో రెండవయర్థము (32–35 సూ॥) సరియైనదని ప్రకరణము ననుసరించి వాసిష్ఠగణపతిమునితలచును.
40. హిరణ్మయ పురుషాకృతి సంబంధమును వదలనందున మొదటి యర్థమును సమంజసమే.
41. మంత్రవర్ణములోని యుత్తరార్ధభాగముమాత్రమాధ్యాత్మికము.
42. ఈ యుద్దేశమువల్లనే దానికి (ఆభాగమునకు) ధ్యానముపదేశింపబడెను.
43. బుద్ధి మూలము నన్వేషించుట ధ్యానప్రకారము.
44. ధ్యానలక్షణమువంటిదే ధ్యేయవస్తువుకూడ (బుద్ధి లక్షణము, బుద్ధిమూలమందున్న జ్ఞానవస్తువు నొక్కటే తత్త్వముగలవి.)
45. ఆవిధముగా నతిశయించిన దృష్టియందు బ్రాప్తించును.
46. మధ్యముని జ్ఞానశక్తికి చెందిన (సుందరికి చెందిన) పంచదశాక్షరీ మంత్ర మాగమములకు సారమై 'ఆసురీ గాయత్రీ' యనబడును.
47. నిగమములకు సారమై సావిత్రీ (ఈమెయు జ్ఞానశక్తియే) సంబంధమగుచున్న మంత్రము 'ఆర్షీ గాయత్రీ' యనబడును (అనగా ఋషి దర్శనమైనదని భావము.)
48. ఇట్లు 47 సూత్రములచే గాయత్రీ వ్యాఖ్యానమయ్యెను.

# యోగ వ్యాఖ్యానమ్

1. యోగం వ్యాఖ్యాస్యామః ।
2. తప ఉపాసనం యోగశ్చేతి పర్యాయాః ।
3. పదమిదం ప్రాధాన్యేన పతంజలి నోపయుక్తమ్ ।
4. యోగశ్చిత్తవృత్తి నిరోధ ఇతి తస్య లక్షణం తేనోక్తమ్ ।
5. వ్యతిరేకత స్తత్ ।
6. అన్వయత ఆలోచనం యోగస్య లక్షణమ్ ।
7. ఆలోచనం ఏవ చిత్తవృత్తి నిరోధః ।
8. ఆలోచనం చ తపః ।

9. తదేవోపాసనమ్ ।
10. ఆలోచనే స్వాత్మస్థితిరపి వృత్తిరితిచే స్మూలచ్ఛేదః ।
11. పశ్య విస్మృతవస్తునోఽంతర్మార్గణే నిజాం స్థితిమ్ ।

# యోగ వ్యాఖ్యానము

1. యోగమును గుఱించి వ్యాఖ్యానించెదము.
2. తపస్సు, ఉపాసనము, యోగము అనునవి పర్యాయపదములు.
3. 'యోగ' పదమును ముఖ్యముగా పతంజలి యుపయోగించెను.
4. చిత్తవృత్తి నిరోధమే యోగమని యతడు దాని లక్ష్యమును బేర్కొనెను.
5. ఈ యర్థము వ్యతిరేకముగా నున్నది.
6. అన్వయమువలన యోగలక్షణ మాలోచనమగును.
7. (ఎట్లనగా) చిత్తవృత్తి నిరోధమనునది యాలోచనము.
8. ఆలోచనమే తపస్సుకూడ అగును. (ఆలోచనము రెండు విధములుగా నున్నట్లు తెలియుచున్నది. వృత్తులను నిరోధించుట మాత్రమే లక్ష్యమైనప్పు డాలోచనము విషయాత్మికమగుచు మనస్సగును. ఇతరవృత్తులను నిరోధించు నాలోచనముకూడ వృత్తియని తెలిసి యెవడు దానినికూడ దానిమూలమును బొందించుటకై మూలసంబంధమగు నాలోచన చేయునో వాని కది యోగము లేదా తపస్సగును. కనుకనే యాలోచనపదమునకు వ్యావహారికార్థము మనస్సైననను, ధాత్వర్థము తపస్సగును. పతంజలి నిర్వచనములో వృత్తినిరోధాలోచనము మనస్సంబంధమైనను యోగమనుట ధాత్వర్థమునకు వ్యతిరేకమగుచున్నదని గ్రహించవలెను )
9. తపస్సగునట్టి యాలోచనమే యుపాసించదగినది.
10. ఆలోచనము స్వాత్మస్థితిని గుఱించి యున్నప్పుడుకూడ వృత్తియే యనినచో మూలసిద్ధాంతమునకే భంగము కల్గును.
11. నిజస్థితిని లేదా స్వాత్మస్థితిని గుఱించిన యాలోచన మెట్లుండు ననగా మఱచిపోయిన వస్తువును గుఱించిన స్మృతిని జ్ఞప్తి పథమునకు దెచ్చుకొనుట కంతర్గతిచే శోధించునట్లుండును.

12. సయోగ స్తత్తపః ।
13. మృగయమాణో లబ్ధ్వైవ నివర్తతే ।

14. యోగిత్వన్యస్య లబ్ధవ్యస్యాభావాత్ నిత్యం మృగయత ఇవ ।

15. అనాత్మ జిజ్ఞాసో రాలోచనం మార్గణమ్ ।

16. ఆత్మజిజ్ఞాసో ర్యోగః ।

17. పశ్య దుఃఖే నిజాం స్థితిమ్ ।

18. స యోగ స్త-త్తపః ।
19. దుఃఖితః శిష్టభోగ్యజాత సన్నికర్షాత్ పునర్నివర్తతే ।

20 యోగితు జితభోగ్యజాతత్వా న్నజాతు చి న్నివర్తతే ।

21. సుషుమ్నాయాః సంవిత్సహస్రార పర్యంతం ప్రవహతి ।
22. తత్ర మానసస్థాన మాసా ద్యాప్తతాషా శీతా భవతి ।

23. సాశీతా సర్వనాడీద్వారా శరీరే ప్రవహతి ।

12. అదియే యోగ మదియే తపస్సు.

13. బాహ్యావస్తువును గుఱించి యట్లు వెతకువాఁడా వస్తుస్మృతి లభ్యమైన తోడనే వెతకుట మానును.

14. ఇతర వస్తుప్రాప్తినిగుఱించి యభావముగల యోగియైనచో తాఁ బొందవలసినది తనకంటె వేఱుకానందున నిత్యము వెతకుచున్నట్లుండును. (అనగా నితని యాలోచనము నిత్యవ్యాపారముగలది గావున వృత్తి యనబడదు. బాహ్యమైన విషయ వస్తుస్మృతిని వెతకు వాని యాలోచన మనిత్యమై వృత్తి సంబంధమగునని గ్రహించవలెను.)

15. అనాత్మ జిజ్ఞాసువునకు (అనగా విషయస్మృతికొఱకు వెతకువానికి) ఆలోచనమే మార్గము (ఇది మనస్సంబంధము.)

16. ఆత్మ జిజ్ఞాసువునకు యోగము మార్గము. (ఇది తపస్సంబంధాలోచనము).

17. సంసారమనెడి దుఃఖజీవితమందున్నవాఁడు (అనగా తానానందమయుఁడైన ఆత్మయని తెలియక విషయానుభవములం దభిమానియై కర్మకు, జన్మజరామృత్యువులకు వశుఁడై దుఃఖించువాఁడు) దుఃఖనివారణకై వెతకి చూడదగినది తన నిజస్థితియే.

18. అట్లు చూచు సాధనమే యోగ మదియే తపస్సు.

19. సంసారి తన ప్రారబ్ధ కర్మ (భోగ్యజాతము) ననుభవించి తిరుగ సంసారమునకే మఱలును. (అది యిచ్చు ననిత్య సుఖానుభవమునే యభిమానించుచు).

20. యోగియైనచో భోగ్యజాతము (నభిమానరాహిత్యముచే) జయించినవాఁడై సంసారమున కెన్నఁడు మఱలఁడు.

21. సుషుమ్నా ద్వారా సంవిత్తు సహస్రారమువఱకు ప్రవహించును.

22. అక్కడ (చంద్రమండలమనబడు) మానసస్థానము బొంది సహజముగా ప్రభుత్వతాపముగలదియైనను శీతలము జెందును.

23. ఆ శీతలసంవిత్తు సర్వనాడులద్వారా శరీరమున ప్రవహించును.

24. సంవిత్ప్రవాహ మధ్యే సేతుం బధ్నీత స యథా మానస స్థానం న ప్రాప్నుయాత్ ।
25. భ్రూమధ్య ఇత్యేకః ప్రకారః ।
26. సేతుబంధో నామ స్థాపనం ధ్యానేన ।

27. తదా సంవిదః ప్రభుత్వం పూర్ణం స్యాత్ అవిభక్తత్వాదశీతత్వాచ్చ ।

28. భ్రూమధ్యే స్థాపితాయాః సంవిదోఽగ్రమేవ లక్ష్యం స్యాత్ ।

29. కంఠ ఇత్యపరః ప్రకారః ।
30. తత్ర సంవిదో మధ్యమేవ లక్ష్యం స్యాత్ ।
31. హృదయ ఇత్యన్యః ప్రకారః ।
32. తత్ర సంవిదో మూలమేవ లక్ష్యం స్యాత్ ।

33. యః సంవిదోఽగ్రే ప్రతితిష్ఠతి స విశ్వేపురుషే ప్రతితిష్ఠతి ।

34. యః సంవిదో మధ్యే ప్రతితిష్ఠతి స తైజసేపురుషే ప్రతితిష్ఠతి ।

24. అది మొదటి ప్రకారమున మానసస్థానము బొందకుండుటకు దాని ప్రవాహ మధ్యమందు సేతువును బంధించవలెను.

25. సేతుబంధము భ్రూమధ్యమందు గావించవలెనని యొక పద్ధతి.

26. అక్కడి ధ్యానముచే సంవిత్తు నక్కడనే స్థిరపరచి స్థాపించుటకు సేతుబంధ మందురు.

27. అప్పుడు సంవిత్తుయొక్క ప్రభుత్వమవిభక్తమైయుండుటవల్లను అశీతలమై యుండుటవల్లను పూర్ణమైయుండును. (దీనిని బట్టి మానసస్థానమును బొందిన సంవిత్తుయొక్క ప్రభుత్వము మానసస్థానముచే నపహరింపబడినదియై విభక్తమగుచున్నట్లు తెలియగలదు.)

28. భ్రూమధ్యమందు స్థాపింపబడు సంవిత్తుకు లక్ష్యము దాని యగ్రమం దుండును.

29. సేతుబంధము కంఠమందు జేయవలెననుట యింకొకపద్ధతి.

30. అక్కడైనచో సంవిత్తుకు లక్ష్యము దాని మధ్యమందగును.

31. హృదయమందు సేతుబంధమని మఱియొక పద్ధతి కలదు.

32. అక్కడ సంవిత్తుకు లక్ష్యము దాని మూలమందగును. (ఈ విధముగా మానసస్థానముతో సంయోగముగాని సంవిత్తు హృదయమునుండి సుషుమ్నద్వారా శిరస్సును బొందినను పురోనాడి యందే స్థితమై పశ్చాన్నాడీమార్గమునకు స్ఖలించని దగుచు పూర్ణవస్త్వనుభవము నిచ్చును. అయితే యీ పురోనాడి యందది త్రిప్రకారములుగా స్థాపనమగుటనుబట్టి మూలపురుషానుభవమును గూడ త్రిప్రకారములుగా ధరించునని విదితమగును. ఇది యోగియొక్క లక్ష్యస్థానము ననుసరించి యుండును.)

33. ఎవడు సంవిదగ్రమందు ప్రతిష్ఠితుడో వాడు విశ్వపురుషుని యందు ప్రతిష్ఠితుడగును.

34. ఎవడు సంవిన్మధ్యమందు ప్రతిష్ఠితుడగునో వాడు తైజసపురుషుని యందు ప్రతిష్ఠితుడగును.

35. యః సంవిదో మూలే ప్రతితిష్ఠతి స ప్రాజ్ఞేపురుషే ప్రతి
తిష్ఠతి ।

36. దేహేఽన్యత్రచ ప్రవహణాత్ జడసంయోగేన విభక్తత్వేనచ
సంవిదః శక్తిః సంసారిషు క్షీయతే ।

37. తతశ్చాత్మా పరిభూయతే బాహ్యైః ।

38. కేవలాయాం నాడ్యాం విలసనాత్ యోగిషు సా విజృంభతే ।

39. తతశ్చాత్మా న పరాభూయతే బాహ్యైః ।

40. మానసస్థాన సంయోగాత్ సంవిచ్ఛ్రితత్వేన నశక్తిమతీ
సంసారిషు ।

41. తదభావేన శక్తిమతీ యోగిషు ।

42. జ్ఞానా యేంద్రియ సాపేక్షత్వాత్ సంసారిషు సంవిదల్పజ్ఞా ।

43. స్వతంత్రత్వా ద్యోగిషు దూరజ్ఞా ।

44. ఇయం పురోనాడీ మవలంబ్య యోగస్య పద్ధతిః ।

45. ప్రథమ మాకాశాత్ ఏకాం శక్తి మాత్మ శిరసి నిపతంతీం
ధ్యాయేత్ ।

35. ఎవడు సంవిన్మూలమందు ప్రతిష్ఠితుడగునో వాడు ప్రాజ్ఞపురుషుని యందు ప్రతిష్ఠితుడగును.

36. దేహమందు (మానసస్థాన సంయోగవశమున) సంవిచ్ఛక్తి యితరత్ర ప్రవహించుట వల్లను, జడవస్తు సంయోగముచే విభక్తమగుటవల్లను సంసారులందు క్షీణించుచున్నది.

37. అట్లు బాహ్యాగతమగు సంవిత్తువలన నాత్మ పరాభవింపబడిన దగుచున్నది

38. కేవల సుషుమ్నానాడియందు (ఇదియే పురోనాడి, యమృతా నాడి యనబడును. పశ్చాన్నాడియందు సుషుమ్న యిడా పింగళ నాడుల సంయుక్తమగుచుండును గావున కేవల సుషుమ్న నమృతానాడిగా నెఱుగవలెను.) విలసించు సంవిత్తుగల యోగియందా సంవిత్తు విజృంభించును (పూర్ణత్వముకొఱకు.)

39. కనుక నట్టి సంవిత్తువలన నాత్మ బాహ్యముచే పరాభవింప బడుట లేదు. [శక్తివంతమగుట లేదు.

40. సంసారులందీ సంవిత్తు మానసస్థాన సంయోగవశమున శీతలమై

41. మానసస్థానమునందభావముచే యోగియందు సంవిత్తు (మఱి యొకవిధముగా — అనగా తపస్సు కొఱకు) శక్తివంతమగు చున్నది.

42. జ్ఞానము కొఱకీ సంవిచ్ఛక్తి యింద్రియముల నపేక్షించి సంసారు లందల్ప జ్ఞానము గలదగుచున్నది.

43. ఇతరోపాధి నపేక్షించక స్వతంత్రమై యోగులందీ సంవిత్తు దూరజ్ఞానముగలది యగుచున్నది.

44. అట్టిది పురోనాడి నవలంబించు యోగపద్ధతి.

45. (ఇంక పశ్చాన్నాడియందు యోగపద్ధతి యెట్లనగా) తొలుత సాధకు డాకాశమునుండి తన శిరస్సులోని కొకానొక శక్తి పడుచున్నట్లు (భావించి) ధ్యానించవలెను.

46. అనంతరం శిరసో మూలాధార పర్యంతం నిపతంతీమ్ ।

47. ఇయం పశ్చాన్నాడీ మవలంబ్య యోగస్య పద్ధతిః।

48. ఇదం సప్త చత్వారింశతా సూత్రాణాం యోగవ్యాఖ్యానంభవతి।

---

## సీతా వ్యాఖ్యానమ్

1. సీతాం వ్యాఖ్యాస్యామః ।
2. ఆది కావ్యస్య యా నాయికా ।
3. సూర్యచన్ద్రా విద్యుదగ్ని పుష్పపల్లవ మణి హిరణ్యాదౌ సర్వ జన నయనానందినీ కాంతి ర స్తి సా శ్రీరుచ్యతే దేవీ ।

4. సీతా సర్వాంగేషు శోభనో త్తమో త్తమా నారీ ।
5. తస్మా చ్ఛ్రియోంశః సాధారణ దృష్ట్యాపి ।
6. సతా మీశ్వరార్పితో నిష్కామకర్మరాశిర్యజ్ఞ ఉచ్యతే ।

7. యజ్ఞశ్చ విష్ణుర్యజ్ఞోవై విష్ణు రితి శ్రుతేః ।
8. యథా సకామవ్యష్టికర్మమయః పురుషః సంసారీ తథా నిష్కామ సమష్టికర్మ మయోఽవతారః ।

9. దాశరథిం రామం సప్తమ మవతార మాహుః ।
10. సకామ వ్యష్టి కర్మణామేవ ఫలాని వర్షశత భోగ్యాన్యాహుః ।

11. కిముత సమష్టికర్మ ణః ఫలమ్ ।

46. అనంతరము శిరస్సునుండి మూలాధార పర్యంతమది పడు చున్నట్లు ధ్యానించవలెను.
47. ఇది పశ్చాన్నాడి నవలంబించు యోగపద్ధతి యగును. (ఇట్లు శక్త్యవతరణమును ధ్యానించువారియందు కుండలిని విజృంభించి యారోహణమగును. ఇది ఫలము. అప్పుడు పురోనాడికూడ స్వాధీనమగును).
48. ఇట్లు 47 సూత్రములచే యోగవ్యాఖ్యానము ముగిసెను.

---

# సీతా వ్యాఖ్యానము

1. సీతను గురించి వ్యాఖ్యానించెదము.
2. ఆదికావ్యమైన రామాయణమున కేవతె నాయకురాలో (ఆ సీత).
3. సర్వజనులకు నయనానందమునిచ్చు సూర్య, చంద్ర, విద్యుత్, అగ్ని, పుష్ప, పల్లవ, మణి, హిరణ్యాదుల కాంతిని శ్రీదేవి యందురు.
4. సీత సర్వాంగశోభనయై యుత్తమోత్తమ నారీమణి యయ్యెను.
5. ఆ కారణమువలన సాధారణదృష్టికిగూడ నామె లక్ష్మియంశయే.
6. సత్పురుషులయొక్క యీశ్వరార్పిత నిష్కామ కర్మరాశి యజ్ఞ మనబడును.
7. యజ్ఞమే విష్ణువనుటకు 'యజ్ఞోవై విష్ణుః' అను శ్రుతిప్రమాణము.
8. సకామమగు వ్యష్టి కర్మమయుడైన పురుషుడెట్లు సంసారియగునో అట్లే నిష్కామమగు సమష్టి కర్మమయుడైనపురుషు డవతార మగును.
9. దశరథ పుత్రుడైన రాముని గురించి యేడవ యవతారమందురు.
10. సకామమైనట్టి వ్యష్టికర్మలయొక్క ఫలమునే నూర్లకొలది సంవత్సరములవఱకు ననుభవింపవచ్చునందురు గదా.
11. సమష్టికర్మల ఫలమింక చెప్పనేల!

12. యజ్ఞమయస్యావతారస్య భోగాయ కిమపి స్రష్టవ్యం స్యా న్నియత్యా ।
13. సత ఏవ సృష్టి ర్నాసతః ।
14. అస్తి కాచన దేవతా ।
15. సా నియతి మారాధయితుం స్వయమప్యవతరతి ।
16. తామేవ లక్ష్మీ మాహుః ।
17. రామస్యానుభూతయే పర్యాప్తం ఫలం సీతా ।
18. రూపే శీలే వాచిచ మధురా ।
19. అస్మాకంతు చరితే మధురా ।
20. అయోనిజాం సీతా మాహుః పూర్వే ।
21. అపవిద్ధాం కేచిత్ ।
22. అత్రేయం చర్చా భవతి ।
23. అప్సాం సూర్యే ప్రథమాహుతి స్తతః సోమోజాయతే ।
24. తస్య పర్జన్యే తతో వర్షమ్ ।
25. తస్య పృథివ్యాం తతోఽన్నమ్ ।
26. తస్య పురుషే తతో రేతః ।
27. తస్య స్త్రియాం తతః పురుషః ।
28. ఏవం పంచాహుతయో జన్మ ప్రయోజికాః ।
29. తస్మా దయోనిజత్వమేవ న సంభవతీ త్యేకః పక్షః ।
30. దేవతా ముక్తపురుషోవా లోకానుగ్రహాయ భువమవతరేత్ ।
31. తత్రాహుతి సంఖ్యా క్వచిదాదృతా స్యాన్మాతాపిత్రో రనుగ్ర హాయ ।
32. క్వచిత్తృతీయస్యామేవాహుతౌ శరీరధారణం మహాభాగ్యాత్ ।

12. యజ్ఞమయుడైన యవతారపురుషునియొక్క భోగము కొఱకు పుట్టుట కేదేని నియమింపబడును.
13. సత్తునుండి పుట్టును, అసత్తునుండి పుట్టజాలదు.
14. అందుకొఱ కొకానొక దేవత యున్నది. [చున్నది.
15. ఆమె ధర్మము నారాధింపజేయుటకు స్వాయముగానే యవతరించు
16. ఆమెనే లక్ష్మి (శ్రీ) యందురు.
17. రాముని యనుభవముకొఱకు ఫలించినదే సీత.
18. రూపమందు, శీలమందు, వాక్కునందుగూడ నామె మధురయే.
19. మన రామాయణ చరిత్రవల్లను నామె మధురయే.
20. పూర్వులు సీత నయోనిజ యనిరి.
21. కొందఱామె నపవిద్ధురాలనిరి (అనగా తల్లిదండ్రులచే విడువబడి యింకొకరిచే పెంచబడినది. ఇంకొక అర్థము పాపములేనిది.)
22. ఇక్కడ చర్చ వచ్చును.
23. సూర్యునియందుదకములకు ప్రథమాహుతి కల్గును. అందువలన సోముడు పుట్టుచున్నాడు.
24. ఆ సోమునకు పర్జన్యునియందాహుతి. దానివలన వర్షము పుట్టుచున్నది.
25. ఆ వర్షమునకు పృథివియం దాహుతిచే అన్నము పుట్టుచున్నది.
26. ఆ యన్నమునకు పురుషునియందాహుతిచే రేతస్సు పుట్టును.
27. ఆ రేతస్సునకు స్త్రీయందాహుతివలన (మఱల) పురుషుడు పుట్టును.
28. ఈ పంచాహుతులు జన్మను గలిగించునట్టివిగా చెప్పబడును.
29. ఆ కారణముచేత సీత కయోనిజత్వమసంభవమని కొందఱందురు.
30. (చర్చకు సమాధానమెట్లనగా) దేవతకాని ముక్తపురుషుడుకాని లోకానుగ్రహము కొఱకు భూమియందవతరించు చుండును.
31. ఒక్కొక్కప్పు డట్టి యవతరణము కొఱకాహుతి సంఖ్య మాతా పితరుల ననుగ్రహించుట కాదరింపబడును.
32. ఇంకొక్కప్పుడు దానికి మూడవయాహుతియందే తనయందున్న మహాభాగ్యమువలన శరీరధారణము సంభవించును.

33. అవతీర్ణస్యాహూతయో న ప్రాతపర్యాయాః ।

34. అపి త్వవతరణ పర్యాయాః ।
35. అవతరతః పతతోవా మార్గ ఏకః ।
36. భౌతికరసో గుప్త స్వశక్తి ర్జడప్రాయః పతతి ।

37. వ్యక్త స్వశక్తిశ్చిజ్జ్వలితో ఽవతరతి ।
38. అవతీర్ణస్య భూమండలం ప్రతిపన్నస్య తృతీయస్యామాహూతావేవాపి మనోబలేన కార్యార్థం శరీరం భవితుం శక్యమిత్యుక్తం భవతి ।

39. తస్మా దయోనిజత్వం నా సంభవీత్యపరః పక్షః ।

40. సీతా 'పతి దేవతానాం' నిదర్శనమ్ ।
41. యత స్త్యాగేపి భర్తరి నిష్ఠితా ।

42. సీతాయాః ప్రభుత్వం భూతేష్వపి దదృశే ।
43. హనూమచ్ఛివా ఽశంసాయా మగ్నౌ ।

44. ఆత్మనః ప్రవేశేచ ।
45. అవకాశ ప్రార్థనా సమయే భువి ।

33. అవతరించువాని విషయములో ఆహుతులు జారిపడునట్టివిగా నుండవు.
34. మఱి యెట్లుండుననగా నవతరణమగునట్టివిగా నుండును.
35. అవతరణమునకు పతనమగుటకుగూడ మార్గ మొక్కటియే.
36. భౌతికరసము గుప్తమైన స్వశక్తిగలదియై జడప్రాయమగుచు పతనమగుచున్నది. (వ్యక్తమగుటకు కామ్యఫలవాసనలను బొంది వానిశక్తిచే వ్యక్తమైనప్పుడు జడప్రాయమగుననియు, నిష్కామకర్మఫల ద్రవ్యమును బొందినప్పుడు — అనగా యజ్ఞద్రవ్యమును బొందినప్పుడు నిజశక్తిచే వ్యక్తమై చిత్తేజ ప్రాయమగుననియు గ్రహింపదగును.)
37. స్వశక్తిచేతనే వ్యక్తమైన భౌతికరసము చిజ్జ్వలితమై యవతరించును.
38. అవతరించినట్టిన్ని, భూమండలమును బొందినట్టిన్ని, తృతీయమైన ఆహుతియందే (అనగా వర్షాహుతిఫలముగా బుట్టుచున్న మనస్సారభూతమగు అన్నమందే) మనోబలముచే కార్యార్థమైన (కారణ) శరీరమును బొంద శక్యమగునని చెప్పవచ్చును.
39. ఆకారణము వలన నయోనిజత్వ మసంభవము కాదని యింకొక పక్షమువారందురు.
40. పతియే దైవమని భావించు పతివ్రతలకు సీత నిదర్శనము.
41. ఎందువల్లననగా (భర్తచే) విడువబడినను భర్తయందే నిష్ఠ జూపెను.
42. సీతయొక్క ప్రభుత్వము పంచమహాభూతములయందును గోచరించును.
43. లంకాదహన సమయమందు హనూమంతుని క్షేమమామె కోరినప్పు డతని తోకనంటియున్న యగ్ని మన్నించుటయందును,
44. ఆమెస్వయముగా నగ్నిప్రవేశ మొనర్చినప్పుడు చితినంటిన యగ్ని తన్ను మన్నించి ముట్టకుండుటయందును,
45. అవకాశము (స్థలము) కొఱకు ప్రార్థించినప్పుడు భూమి ప్రవేశమునిచ్చుటయందును (నామెకు భూతములపైగల యధికారము స్పష్టమయ్యెనని భావము).

46. లంకావాస సమయే ఘోరేణోపవాసేన తస్యా అపారం యోగవైభవం వ్యాఖ్యాతం భవతి ।
47. పత్యు రపి దేవతేవాభూత్ సా భగవతీ ।
48. ఏతాంహి విగ్రహరూపాం రామః సిషేవే త్యాగేఽపి ।

49. సంకీర్త్యా సీతా పుణ్యచరిత్రా ।
50. సముపాస్యా సీతా కమలాత్మికాయా అవతారః ।
51. తదిదం పంచాశతా సూత్రాణాం సీతా వ్యాఖ్యానం భవతి ।

---

46. లంకావాస సమయములో ఘోరమైన ఉపవాసముచే నామె యొక్క అపార యోగవైభవము వ్యాఖ్యాతమైనది.
47. భగవతియైన సీత తనభర్తకు గూడ దేవత యయ్యెను.
48. (ఎట్లనగా) రాము డామెను విడిచినను నామెను విగ్రహరూపముచే సేవించెను.
49. అట్టి పుణ్యచరిత యగు సీత కీర్తింపబడుచున్నది.
50. ఉపాసింపదగిన సీత కమలాత్మికయొక్క యవతారము.
51. ఆ యీ 50 సూత్రములచే సీతా వ్యాఖ్యానమయ్యెను.

సీతావ్యాఖ్యాన సందర్భములో రామాయణ కావ్యమందు వాల్మీకి యొసగిన యంకెల సంకేతమును గుఱించి గణపతిముని యుపన్యసించిన విషయము లిక్కడ పొందుపరచబడుచున్నవి :—

1. సీత వివాహకాలమునాటికి రాముని వయస్సు 16 సంవత్సరములనియు, సీతతోగూడి యరణ్యవాసమున కేగుసమయమునకు 25 సంవత్సరములనియు వాల్మీకి రామాయణమునుండి తెలియును.

2. 14 సం॥ లరణ్యవాసముజేసి రావణునితో యుద్ధము ముగించుకొని వచ్చుసరికి రామునకు 39 సం॥లు నిండియుండును. లేదా 40 సం॥లు వయస్సున నుండును.

3. అట్టి రాముడు పుట్టక పూర్వము దశరథుడు బిడ్డలులేక 60 వేల సం॥లు గడపిన మాట మానవుని ఆయుఃప్రమాణము యుగముల ననుసరించి వ్యత్యాసము జెందవచ్చునను భ్రాంతిని గల్పించుచున్నది.

4. అట్లే వానరసైన్యముయొక్క సంఖ్య లంకాద్వీపము బట్టుట కవకాశము లేనంతగా నున్నది.

5. ఇలపై రాముడు 'దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ' అని చెప్ప బడినంతకాలము నివసించియుండెను. ఈ శ్లోకవచనమునుబట్టి (10,000+1,000) అని లెక్కించినచో రాముడు రావణ సంహారమును 40 సం॥లు వయస్సున దాటక పూర్వమే ముగించియు భూమిపై 11,000 సం॥ లుండెననుట యసందర్భముగా దోచును.

6. ఆ యుగములోని ఆయుఃప్రమాణము వేలకొలది సంవత్సరములైనచో రాముని యరణ్యవాసమును గోరినప్పుడు కైక 14 సం॥లు మాత్రమే కోరుట వింత

యగును. దీనినిబట్టి వాల్మీకి కొన్నిచోట్ల లెక్కలను మానవధర్మమున కనుగుణముగను, మఱికొన్నిచోట్ల నుత్ప్రేక్షాపూర్వకముగను నిచ్చినట్లగపడును.

7. అంతేగాక కృతయుగమునాటికే వేదము ప్రమాణముగా వెలసినందున వేదములోని 'పశ్యేమ శరదశ్శతమ్', 'శతాయుః పురుషః' అనునట్టి వాక్యములాయుఃప్రమాణము నీనాటివలెనే 100 సం॥లని పేర్కొనుచుండెను. స్మృతులు కూడ 100 సం॥ల నంగీకరించెను. దీనినిబట్టి పురాణములం దాయుఃప్రమాణము వేదవిరుద్ధముగా వచింపబడినట్లగపడును.

8. అట్లైనను, అంకెలలో సహస్రములు శతములు నున్నప్పుడొక లక్షణార్థముండి యుండునని తోచకపోదు. ఈ రహస్యము నెఱిగినచో వాల్మీకిప్రోక్త ప్రమాణముల యదార్థము విశదమగును.

9. అది యెట్లనగా, 100 లో మూడంకెలు, 1,000 లో నాల్గు, 10,000 వేలలో నైదు, నిట్లెన్ని యంకెలో అంత విలువ నా సంఖ్యకు గైకొనవలెను.

10. ఈ విధముగా 'దశవర్ష సహస్రాణి దశవర్ష శతాని చ' అను సంఖ్యావచనమునకు 10×4+10×3=70 సం॥ము లను నర్థము వచ్చును. అనగా రావణ సంహారము వఱకు రాముని జీవితమందు 40 సం॥లు గడచిన పిదప నతడు భూమియందు 30 సం॥లు మాత్రముండెనని విశదమగును.

11. దశరథుని పక్షములో బిడ్డలకొఱకు దుఃఖభరితుడై యొక్కొక్క సంవత్సరము వేయి సంవత్సరములంత భారముగా గడపినట్లెంచినచో 60,000 సం॥ము లనగా 60 సం॥లకు పిదప బిడ్డ లతనికి బుట్టినట్లన్వయమగును. పిమ్మట రామున కిఱువదియైదు సం॥లు వయస్సున వచ్చినప్పు డతనికి వనవాసము విధించి దశరథుడు చనిపోయెను. కనుక నతని జీవిత మొత్తము 85 సం॥ లగును.

12. ఈ సందర్భములో కాళిదాసు చెప్పిన 'కించి దూనం శరదామయుత' మ్మను వాక్యములో సంఖ్యను నిర్ణయించు పదము 'యుత' మని గ్రహించినయెడల య=1, త=6 అను నక్షర సంకేతముచే యుత=16 అగును. కచటపయ సిద్ధాంత నియమము ననుసరించి యీ సంఖ్యను తిరుగవేసినచో 61 అగును. దానికి కొంచె మూనము లేదా తక్కువ కనుక 60 సం॥ లని పైని పేర్కొనబడిన సంఖ్య వచ్చును.

13. ఇట్లే రామాయణము శతకోటిసహస్రశ్లోకప్రోక్తమనినప్పుడు శత×కోటి=3×8=24 గావున 24,000 శ్లోకములచే నిబద్ధమైనదగును.

---

# కృష్ణ వ్యాఖ్యానమ్

1. కృష్ణం వ్యాఖ్యాస్యామః।
2. స విష్ణో రష్టమోఽవతారః।
3. ఉపనిషత్సు యాజ్ఞవల్క్యోద్దాలక పిప్పలాద ప్రభృతయ ఆచార్యాః శ్రూయన్తే।
4. తేషాం సర్వేషా మప్యేకోఽప్రతిమానం పరమాచార్యో [నః కృష్ణః।
5. గీతా స్మృతే రయం హ్యుపదేష్టా।
6. గీతాః ఖలూపనిషదాం వివర్తః।
7. అసకృదావర్తీ చన్ద్రలోకాత్ప్రచ్యుతోవా పురుషో భువి జన్మ ప్రాప్తః సర్వః సంసారీ।
8. స స్వేనైవ కర్మణా ప్రారబ్ధవా న్భవతి।
9. అవతారస్తు లోకానుగ్రహాయావతీర్ణో ముక్త పురుషః।
10. దేవోవా।
11. తస్య సర్వేషు లోకేషు కామచారో భవతీతి శ్రుతే ర్ముక్తస్య మానవలోకాగమన మవిరుద్ధమ్।
12. దేవస్య చ
13. తస్య పృథగ్జన్మ సంసారహేతుభూతం నాస్తి కర్మ।
14. తస్మాత్కార్యార్థ మవతీర్ణస్య తస్య యజ్ఞేన ప్రారబ్ధవత్వం స్యాత్।
15. యజ్ఞశ్చేశ్వరార్పితః సతాం కర్మరాశిః।
16. క్రతుమయః పురుష ఇతి శ్రుతిః।
17. యథా సంసారీ కర్మమయః తథావతారో యజ్ఞమయః।
18. యజ్ఞశ్చ క్రతురేవ।
19. విశేషస్తు వ్యష్టిసమష్టి భేదాత్।
20. యజ్ఞశ్చ విష్ణుః।

# కృష్ణుని గుఱించి వ్యాఖ్యానము

1. కృష్ణుని గుఱించి వ్యాఖ్యానించెదము.
2. అతడు విష్ణువుయొక్క యెనిమిదవ యవతారము.
3. ఉపనిషత్తులందు యాజ్ఞవల్క్యుడు, ఉద్దాలకుడు, పిప్పలాదుడు మొదలగువా రాచార్యులుగా వినబడుచున్నారు.
4. వారికి మనకుగూడ అప్రతిమాన పరమాచార్యుడు కృష్ణుడు.
5. ఇతడు గీతా స్మృతి కుపదేష్ట.
6. గీత యుపనిషత్తులకు రూపాంతరము.
7. మాటిమాటికిగాని చంద్రలోకమునుండి జారినటులగాని వచ్చు పురుషులందరు భూలోకమున జన్మప్రాప్తిచే సంసారము బొందుచున్నారు.
8. వారు తమ కర్మచేతనే ప్రారబ్దముగలవా రగుచున్నారు.
9. అవతారపురుషుడైనచో లోకానుగ్రహము కొఱ కవతరించిన ముక్త పురుషుడగును.
10. (లేదా) దేవుడు కావచ్చును.
11. 'అతడు సర్వలోకములందు స్వేచ్ఛా సంచారి' యని చెప్పు శ్రుతి వలన ముక్తుని మానవలోకాగమనము విరుద్ధము కాజాలదు.
12. దేవునికైనను (అట్టి యాగమన మసంభవముకాదని భావము.)
13. దేవుని ప్రత్యేక జన్మకు హేతుభూతము సంసారకర్మకాదు.
14. కనుక కార్యార్థ మవతరించుట కతనికి యజ్ఞమే ప్రారబ్ద వతుగా నుండును.
15. యజ్ఞమనగా నీశ్వరార్పితమైన సత్పురుషకర్మరాశి.
16. పురుషుడు క్రతుమయుడని శ్రుతి చెప్పును.
17. సంసారి యేవిధముగా కర్మమయుడో ఆవిధముగానే యవతార పురుషుడు యజ్ఞమయుడు.
18. యజ్ఞముకూడ క్రతువే.
19. విశేషమేమనగా వ్యష్టిసమష్టుల యజ్ఞమందు వ్యత్యాసమున్నది.
20. యజ్ఞమే విష్ణువనబడెను. (అనగా సమష్టి నిష్కామకర్మ).

21. అధి యజ్ఞోఽహమేవాస్మి న్దేహే దేహభృతాం వరేతి గీతా వాక్య మత్ర భవతి।

22. అక్షరం కూటస్థంచ పృథఙ్నిర్దిశ్య కృష్ణో యజ్ఞమాత్మాన మాహ।

23. జ్ఞాపయతి తేన యజ్ఞోఽవతారో న హిరణ్యగర్భో న సూత్రాత్మా న పరంబ్రహ్మేతి।

24. అస్మిన్దేహ ఇతి సర్వసాధారణ దేహాన్వయేపి న విరోధః।

25. సంసారిణోపి క్రతుమయత్వాత్।

26. అధియజ్ఞ శబ్దస్య వ్యష్టి వాచకత్వం సంసారిపరత్వే।

27. సమష్టి వాచకత్వ మవతారపరత్వే।

28. ఏకత్ర భక్తిః।

29. అన్యత్ర యోగః।

30. ఉభయత్రాపి వ్యవహార స్తుల్యః।

31. ముక్త పురుష మివ క్వచి చ్చన్ద్రలోకా దాగతమపి యజ్ఞ ఆవిశేత్।

32. నవమాహుతి క్రమతః సిద్ధమపి క్వచిత్।

33. క్వచి దుత్తమ సంకల్పబలేన సిద్ధమ్।

34. నర నారాయణయోర్మధ్యే నారాయణో నామ దేవర్షి ర్యదు కులేఽవతీర్ణ స్తం యజ్ఞ ఆవిశత్।

21. "హే దేహభృతాం వర! ఈ దేహమందధిష్టించిన యజ్ఞమునే నేను" అను గీతావాక్య మిక్కడ ప్రమాణము.
22. ప్రత్యేకముగా నక్షరుని కూటస్థుని నిర్దేశించిన పిదప తాను యజ్ఞాధిష్టానుడని (కృష్ణుడు) చెప్పుచున్నాడు.
23. అందువలన జ్ఞప్తిచేయబడినది యేమనగా యజ్ఞమే యవత రించును కాని హిరణ్యాగర్భుడు, సూత్రాత్మ, బ్రహ్మ మొద లగు వా రవతరించుట లేదని.
24. అవతార 'మీ దేహమందే' (యావేశరూపమున) వచ్చునని నప్పుడు సర్వసాధారణమైన దేహముగా నన్వయించుకొని నను విరోధముండదు. [మొప్పును).
25. సంసారియు క్రతుమయుడగుటవలన (పై విధమగు నన్వయ
26. అధియజ్ఞ శబ్దమునకు వ్యష్టివాచకత్వము సంసారిపరముగను,
27. సమష్టి-వాచకత్వ మవతారపరముగను నుండును.
28. ఒక పక్షములో భక్తి పరమై.
29. ఇంకొక పక్షములో యోగపరమై.
30. రెండు పక్షములందును వ్యవహారము తుల్యమై యుండును.
31. ముక్తపురుషు నావేశించునట్లే చంద్రలోకమునుండి వచ్చిన సాధారణ పురుషునిగూడ (సంసారిపరముగ) యజ్ఞ మావే శించుచుండును.
32. ఒకొక్కప్పుడది నూత్నముగా జేయబడిన కర్మయొక్క ఆహుతిచే క్రమవశమున పక్వమైనవాని నావేశించును.
33. ఒకొక్కప్పుడది సంకల్పబలముచేతనే (ఆహుతిక్రమకాలము నతిక్రమించి) పాకము జెందినవానిని.
34. నర నారాయణులలో యదుకులమం దవతరించిన నారాయణు డను దేవర్షిని యజ్ఞ మావేశించెను. (ఇదియే విష్ణు వావే శించెననుట.)

35. స కృష్ణ ఇతి వాసిష్ఠస్య మతమ్।

36. పురుషో_త్తమ ఏవ లీలయా మానవలోకే కృష్ణశరీరం ధృతవానిత్యేకే ।

37. తేషు ద్వౌ దళౌ ।

38. తేజోంశేనేత్యేకః ।

39. మాయయేత్యపరః ।

40. మూలపురుషాదవతారో నితాన్తం న్యూనః ప్రథమదళమతే।

41. మూలపురుష సదృశ ఏవావతారో ద్వితీయదళమతే।

42. అపిచ విభుః ।

43. ఈశ్వరావిశేషత్వాత్ ।

44. అపిచ మాయోపాధికః ।

45. ఈశ్వరావిశేషత్వాత్ ।

46. అపిచ సర్వజ్ఞః ।

47. ఈశ్వరావిశేషత్వాత్ ।

48. అపిచ సర్వశక్తః ।

49. ఈశ్వరావిశేషత్వాత్ ।

50. అణవోఽవిద్యోపాధికా అల్పజ్ఞా అల్పశక్తయశ్చ జీవాః ।

51. కర్మభేదాదవతార జీవ భేదో వాసిష్ఠస్య మతే ।

52. సత్యప్యేవం మతభేదే సంసారిభ్యోఽవతారో విశిష్ట ఇతి సర్వసమ్మతమ్ ।

53. తస్మాదవతారః కీ_ర్తనీయ ఉపాస్యశ్చ భవతి।

54. కృష్ణో జార ఇత్యాపాతతః కథావలోకకానాం భ్రాన్తిః ।

35. అతడే కృష్ణుడని వాసిష్ఠాభిప్రాయము.

36. కొందఱు పురుషోత్తముడే (అనగా పరమపురుషుడే) తన లీలచే మానవలోకమందు కృష్ణశరీరమును ధరించె నందురు.

37. వారిలో రెండు తెగలున్నవి.

38. తేజోంశచే ధరించినట్లొక తెగవారును,

39. మాయచే ధరించినట్లింకొక తెగవారును (పల్కుదురు).

40. మూలపురుషుని కంటె తక్కువ తేజోంశావతారమగును.

41. మూలపురుషుని వంటిదే మాయావతారమగును.

42. ఎట్లైనను, అవతరించినవాడు విభుడేయగును.

43. ఈశ్వరుని కంటె వేఱుకానందున.

44. మఱియు మాయనుపాధిగా గలవాడగును.

45. ఈశ్వరుని కంటె వేఱుకానందున.

46. మఱియు సర్వజ్ఞుడగును.

47. ఈశ్వరుని కంటె వేఱుకానందున.

48. మఱియు సర్వశక్తిమంతుడగును.

49. ఈశ్వరుని కంటె వేఱుకానందున.

50. అవిద్యోపాధికమైన, అణుమాత్రమైన జీవులల్పజ్ఞానము నల్ప శక్తియు గలవారే.

51. కర్మభేదమువల్లనే యవతరించువారికిని జీవులకును భేదముండునని వాసిష్ఠాభిప్రాయము.

52. పైని పేర్కొనబడిన భేదయుక్త వివిధమతములున్నను నవతార పురుషుడు సంసారులకంటె విశిష్టుడనుమాట సర్వసమ్మతమే.

53. అందువలన నవతారము కీర్తింపదగినది యుపాసింపదగినది యగుచున్నది.

54. కృష్ణునకు జారత్వ మాపాదించుట యల్పదృష్టితో కథలను జూచువారి భ్రాంతి.

55. రాసక్రీడా వర్ణనే దేవకీ నన్దనం సత్యం కృష్ణం మధ్య ఏవ
గోపీనామసంగం గాయన్తి।

56. గోపీభిః సహితాః కృష్ణాస్తు తన్మనః పరికల్పితాః।

57. ముఖ్యా కృష్ణమాయా కల్పితావా యథా గోప్యుద్దేశమ్।
58. కవి కల్పితావా భక్తానా మీశ్వరస్యచ నాయికా నాయకభావేన
హృది స్థితేన।

59. అత్ర భక్తానామేవ గోపీత్వేన కల్పనమ్।
60. భగవాంశ్చ వదతి వర్త ఏవచ కర్మణీతి।
61. కర్మచాత్ర సత్కర్మ భవతి।
62. జారః కథం ఆత్మానం సత్కర్మాణం వక్తుం శక్నుయాత్।
63. గీతాశ్చే న్న ప్రమాణం క్రీడాగ్రన్థః కథం ప్రమాణమ్।
64. క్రీడాగ్రన్థోఽన్యథా నేతుం శక్యతే।
65. న గీతా వచనమ్।
66. తాత్పర్య భంగాపత్తేః।
67. కృష్ణస్య పరిగ్రహా ఏవ షోడశసహస్రం నారీణాం యదన్యత్।
68. పరిగ్రహా బహుత్వే ప్యసంగః కృష్ణః।
69. అత ఏవ తమ్ అస్ఖలితం బ్రహ్మచారిణ మాహుః।
70. సుఖ దుఃఖయోః సమచిత్తః కృష్ణః।
71. యోగేశ్వరత్వాత్।
72. అత ఏవాద్భుతకారీ।
73. కృష్ణే కాళీ శక్తి ర్విజృంభే యథాప్రాహు స్తాన్త్రికాః।
74. కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధ ఇతి గీతావచనం చాత్ర
భవతి।
75. ఇతి చతుస్సప్తత్యా సూత్రాణాం కృష్ణవ్యాఖ్యానం భవతి।

---

55. రాసక్రీడావర్ణనలో దేవకీనందనుడైన సత్యస్వరూపుడగు కృష్ణుని గూర్చి గోపికలమధ్యనున్నను నత డసంగుడని గానము చేయబడెను.

56. గోపికలతో గూడిన కృష్ణుడు గోపికామనస్సులకే చెందు కృష్ణుడు (అనగా వారి భావమం దగపడువాడే కాని నిజమగు కృష్ణ వ్యక్తి కాదు.) [బడియుండురు.

57. ముఖ్యముగా కృష్ణమాయను గల్పించుటకైన గోపిక లుద్దేశింప

58. (లేదా) భక్తులకు నీశ్వరునకు నడుమ నాయికానాయకభావముచే భక్తులయొక్క హృదయస్థితినిగురించి చెప్పుటకైన కవి కల్పనమై యుండును.

59. ఇక్కడ భక్తులకొఱకు గోపీత్వము చెప్పుటయే కల్పనోద్దేశము.

60. 'నేనే కర్మయందు వర్తించువాడ'నని గీతలో భగవంతుడేచెప్పెను.

61. అక్కడ కర్మ యనగా సత్కర్మ యగును. [గలడు?

62. జారుడైనచో తాను సత్కర్మతో గూడిన ట్లే విధమున బల్క

63. గీతలు ప్రమాణము గావనిచో క్రీడాగ్రంథ మెట్లు ప్రమాణ

64. క్రీడాగ్రంధము నన్యధా వ్యాఖ్యానించవచ్చును. [మగును?

65. (కాని) గీతావచనము నట్లు చేయరాదు.

66. ఎందుచేతననగా గీతల తాత్పర్యమునకు భంగాపత్తి గల్గును.

67. కృష్ణునియొక్క పదునాఱువేలస్త్రీల పరిగ్రహవిషయ మింకొకటి.

68. బహుభార్యలను పరిగ్రహించినను కృష్ణు డసంగుడే.

69. అందువల్లనే అతని నస్ఖలిత బ్రహ్మచారి యనిరి.

70. సుఖదుఃఖముల రెండింటియందును కృష్ణుడు సమచిత్తుడు.

71. యోగేశ్వరుడగుటవలన.

72. అందువల్లనే అద్భుతములను జేసినవాడయ్యెను.

73. కృష్ణునియందు విజృంభించినది కాళికాశక్తి యని తాంత్రికులందురు.

74. 'నేను ప్రవృద్ధుడనై లోకక్షయమొనర్చు కాలరూపుడనైతి' నను గీతావచన మిక్కడ ప్రమాణము.

75. ఇట్లు 74 సూత్రములుగల కృష్ణవ్యాఖ్యానమయ్యెను.

# రుద్రకుటుంబ సూత్రమ్

1. జ్యోతిరిద మాసీ దవైకృతం వ్యాపకం చిద్రూపమ్ ।
2. తస్య సదితి బ్రహ్మేత్యాత్మే త్యన్యాని నామాని భవన్తి ।
3. తస్యేయం ప్రథమేక్షా యదాత్మానం వ్యాప్తం ప్రాజానాత్ ।

4. సా ద్యౌః సమపద్యత ।
5. అనన్తరాణాం విజ్ఞానానాం భిత్తిః ।

6. ఇమామేవానన్తం దేశమాహుః ।
7. అదితి రఖండ్యత్వాత్ ।
8. అథ జ్యోతి ర్దివ మభ్యతపత్ ।

9. అవ్యక్త శబ్దరూపతా తదా తస్య ।
10. అవ్యక్త శబ్ద ఏవ ప్రణవో నామాన్తరేణ ।
11. స దివ మభితప న్స్వమానాసీత్ ।

12. సర్గాయ క్రియావత్త్వ మత్ర పుంస్త్వమ్ ।
13. సర్గాయ క్రియాచ తపః ।
14. స పుమాన్రుద్రో నామ ।
15. అభితప్యమానా ద్యౌ ర్యోషాసీత్ ।
16. సర్గక్షేత్రత్వ మత్ర యోషాత్వమ్ ।
17. సా రుద్రాణీ నామ ।
18. తౌ దంపతీ భవతః ।
19. విశ్వస్య మాతా పితరౌ ।
20. అత ఏవ రుద్రాణ్యంబికోచ్యతే ।

# రుద్రకుటుంబ సూత్రము

1. వికృతముబొందక వ్యాపించిన చిద్రూపమై యీ జ్యోతియుండెను.
2. దీనికి సత్తని, బ్రహ్మమని, యాత్మయని యితరపేర్లు కలిగెను.
3. ఆ జ్యోతియొక్క ప్రథమ యీాక్షు యెట్టిదనగా ఆత్మను వ్యాప్త మైనదిగా తెలుసుకొనునట్టిది.
4. ఆ యీాక్షుయే ద్యులోకమయ్యెను. (అనగా నాకాశము).
5. అది తరువాత వచ్చిన విజ్ఞానములకు గోడవంటిది. (అనగా విజ్ఞానములనెడి చిత్రములు ప్రకాశించుట కాశ్రయము [వంటిది.)
6. దీనినే యనంతమైన దేశమనియు చెప్పుచున్నారు.
7. ఖండింపబడనిదగుటవలన 'అదితి' యగుచున్నది.
8. పిమ్మట నీ జ్యోతి (తన యీాక్షుయైన) ద్యులోకమును ప్రజ్వ లింప జేసెను.
9. అప్పుడు దాని కవ్యక్తశబ్దరూపము గల్గెను (ఆద్యులోకమునకు).
10. అవ్యక్తశబ్దమే ప్రణవ మను నామాంతరము కలది.
11. ఆ ప్రణవరూపము (జ్యోతిస్సంబంధమై) ద్యులోకమును తపింప జేయుచు పురుషుడయ్యెను.
12. సృష్టికొఱకు క్రియను బొందుటయే యిక్కడ పురుషత్వము.
13. సృష్టిసంబంధక్రియయే (యతని) తపస్సు.
14. ఆ పురుషుడే రుద్రనామకుడు.
15. తపింపజేయబడినదియై ద్యులోకము స్త్రీ యయ్యెను.
16. సృష్టిక్రియకు క్షేత్రమగుటయే యిక్కడ స్త్రీత్వము.
17. ఆమెయే రుద్రాణీ నామము గలది.
18. వా రుభయులు దంపతులగుచున్నారు.
19. విశ్వమునకు వారే మాతాపితరులు.
20. అందువల్లనే రుద్రాణి నంబిక యని పిలుతురు.

21. రుద్రస్త్ర్యంబకో భువనస్య పితాచ ।

22. తయోర్వ్యక్తః శబ్ద ఆద్యః పుత్ర ఆసీత్ ।
23. స ఏవ బ్రహ్మణస్పతిః ।
24. గణపతి స్తాన్త్రికాణాం భాషాయామ్ ।
25. అయంచ వ్యక్తః శబ్దః కర్ణపిధానకాలానుభూతకల్పో నిత్య ఆకాశే ।

26. రుద్రః స శబ్దాం దివం పునరభ్యతపత్ ।

27. వాయు రజాయత ।
28. స ద్వితీయః పుత్రః ।
29. భైరవ స్తాన్త్రికాణాం భాషాయామ్ ।
30. తం రుద్రోఽన్వభవత్ ।
31. స స్పర్శః ।
32. తత్ర ద్యౌః శరీరాయతే ।
33. తరంగవశా న్నానాత్వ వ్యవహారశ్చ వాయోః ।

34. తదా వాయవో రుద్రసూనవో మరుత ఉచ్యన్తే ।

35. రుద్రః స స్పర్శ వాయుశబ్దాం దివం పునరభ్యతపత్ ।

21. రుద్రుని త్ర్యంబకుడనియు, భువనములకు తండ్రియనియు పిలుతురు. (త్రిభువనసృష్టికి కారణ మీాతఁ గావున మూడింటికి మూడు దృష్టులు బరపు ముక్కంటివాడని యొక భావము. మూడు దృష్టులు అంబికవైనచో వారి భర్త యని యింకొక భావము.)
22. వారియొక్క వ్యక్తశబ్దమే ప్రథమపుత్రుడయ్యెను.
23. అతడే బ్రహ్మణస్పతి.
24. తాంత్రికుల పరిభాషయం దతడే గణపతి.
25. ఈ ప్రథమమైన వ్యక్తశబ్ద మాకాశమం దనుభవమాత్రమున నున్నది. ఎట్లనగా, మనము చెవులు మూసికొనినప్పుడందలి యాకాశమం దనుభవమగు శబ్దమువలె.
26. ఈ వ్యక్తశబ్దముతో గూడిన దివము నవ్యక్తప్రణవరూపుడగు రుద్రుడు తిరుగ జ్వలింపజేసెను.
27. వాయువు పుట్టెను (వ్యక్తశబ్ద విజృంభణమువలన).
28. అది ద్వితీయ పుత్రుడయ్యెను.
29. తాంత్రికుల పరిభాషయం దితడే భైరవుడు.
30. ఆ వాయువును రుద్రు డనుభవించెను.
31. అట్టి యనుభవమే స్పర్శ.
32. ఆ స్పర్శానుభవమునకు దివమే శరీరమగుచున్నది.
33. వాయువునకు తరంగ (చలన) వశమువలన నానాత్వముచే వాయువులను బహువచనముకూడ వ్యవహారమందు కల్గెను.
34. అప్పు డా వాయువులు రుద్రసూనులైన మరుత్తు లనబడిరి. (వీరును భైరవరూపులే గావున ద్వితీయ పుత్రుని వంటివారని యెఱుగవలెను.)
35. రుద్రు డా స్పర్శవాయుశబ్దములతో గూడిన దివమును తిరుగ జ్వలింపజేసెను. (వ్యక్తసృష్టికొఱకు దివమును తపింపజేయువాడు రుద్రుడే యగుచున్నందున నతని తపస్సునుండి పుట్టిన కుటుంబము రుద్రకుటుంబము.)

36. సూర్యోఽజాయత(పాఠాంతరః—వ్యక్తం తేజోఽజాయత)
37. స తృతీయః పుత్రః।
38. సోఽగ్నిః।
39. గుహస్తాన్త్రికాణాం భాషాయామ్।
40. స ఏష రుద్రకుటుంబ స్తత్త్వతో వ్యాఖ్యాత స్తత్త్వతో వ్యాఖ్యాతః।

---

# ఇన్ద్రేశ్వరాభేద సూత్రమ్

1. ఇన్ద్రః శివశ్చ నద్యౌ।
2. ఇన్ద్రాణీ రుద్రాణీచ నద్యౌ భవతః।
3. ఇన్ద్రేశ్వరయో రేకార్థత్వా దిన్ద్రేశ్వరాభేదః।
4. పురాం భిన్దు రింద్రః పురభిదీశ్వరోఽపి।
5. దేవరాజ ఇన్ద్రో మహాదేవ ఈశ్వరోఽపి।
6. మహేన్ద్ర మహేశ్వర శబ్దావపి హి తుల్యార్థౌ।
7. రుద్ర సంక్రన్దన శబ్దౌచ।
8. ఉగ్రశబ్దో హ్యుభయత్ర ప్రయుజ్యతే।
9. ఈశాన శబ్దశ్చ।
10. భీమ శబ్దశ్చ।
11. ఉభయోరప్యధిభూతం వైద్యుతతేజోరూపత్వాత్।
12. మరుదీశ ఏకో భూతేశోఽపరోఽపి।
13. భూతాశ్చ రుద్రాః।
14. రుద్రాశ్చ మరుద్భ్యో నాతిరిచ్యన్తే।

36. అప్పుడు సూర్యుడు పుట్టెను (పాఠాంతరము —వ్యక్తతేజస్సు పుట్టెను.)
37. అతడు తృతీయ పుత్రుడు.
38. అతడే యగ్ని.
39. తాంత్రికుల పరిభాషయం దతడే గుహుడు.
40. ఇట్లు రుద్రకుటుంబము తత్త్వముచే వ్యాఖ్యానింపబడెను, తత్త్వముచే వ్యాఖ్యానింపబడెను.

---

# ఇంద్రేశ్వరాభేద సూత్రము

1. ఇంద్రుడు, శివుడును నిద్దరు కారు.
2. ఇంద్రాణీ రుద్రాణీలును నిద్దరు కారు.
3. ఇంద్రేశ్వరుల కేకార్థముండుటవలన నింద్రేశ్వరాభేద మొప్పును.
4. పురములను భేదించువాడై యింద్రుడుకాగా పురభిత్తీశ్వరుడును అగుచున్నాడు. (త్రిపురాసురుని భేదించి పురభిత్తయ్యెను.)
5. ఇంద్రుడు దేవతలకు రాజైనచో మహాదేవు డీశ్వరుడయ్యెను.
6. మహేంద్రశబ్దము, మహేశ్వరశబ్దము తుల్యార్థములు గలవి.
7. రుద్ర సంక్రందన శబ్దములును నట్లే.
8. ఉగ్రశబ్దమే యుభయులందు బ్రయోగింపబడుచున్నది.
9. ఈశాన శబ్దమట్లే.
10. భీమశబ్దము కూడ.
11. అధిభూత తత్త్వమందుభయులకు వైద్యుత తేజోరూపత్వమే యుండుట వల్లను, తెలియును.
12. ఒకడు మరుదీశ్వరు డింకొకడు భూతేశుడగుటవల్లను నభేదము
13. భూతములుకూడ రుద్రులే. (ఇక్కడ బహువచనప్రయోగమును బట్టి రుద్రులని నప్పుడు రుద్రాంశలుగా నెఱుగవలెను.)
14. రుద్రులు మరుత్తులు కంటె వేఱుకారు.

15. ఉభావపి దుష్టసంహారాయ హి ప్రేర్యేతే ।
16. ఉభయో రప్యపారః పరాక్రమో వర్ణ్యతే హి ।
17. మృత్యుం జయత్వం చ ।
18. శివ వాహనభూతో వృషో వర్షకత్వ వ్యుత్పత్తే రిన్ద్రవాహన భూతాన్మేఘా న్నాతిరిచ్యతే ।
19. స వృష్ట్యా సర్వానన్దకరత్వా న్నన్దీ ।
20. సేచకత్వా దుక్షా ।
21. జలాత్మకత్వా ద్గౌః ।
22. అత ఏవ బహిర్నీల ఇవ దృశ్యమానోపి శ్వేతో వర్ణ్యతే ।
23. ఆపోహి శ్వేతాః ।
24. ఏవం చే దిన్ద్రేశ్వరయో ర్ద్వేధా వ్యవహారః కుత ఇతిచేత్ ।
25. రుద్రో మహాన్ప్రాణః ।
26. సోఽధి దైవత మిన్ద్రః ।
27. మధ్యమస్యాధ్యాత్మికం నామ రుద్ర ఇతి ।
28. ఆధిదైవికం నామేశ్వర ఇతి ।
29. తతో రుద్రాణీ ప్రాణశక్తి రిన్ద్రాణీ దేవతా స్త్రీరూపాచేత్యుక్తం భవతి ।
30. రుద్ర ఇన్ద్రస్య తత్త్వమ్ ।
31. ఇన్ద్రో రుద్రస్యాభిమానీ ।
32. రుద్రాణీన్ద్రాణ్యా స్తత్త్వమ్ ।
33. ఇంద్రాణీ రుద్రాణ్యా అభిమానినీ ।
34. రుద్రాణీ రుద్రశ్చ యోగిభిరుపాస్యేతే తేహ్యాధ్యాత్మచింతకాః ।

15. ఇంద్రేశ్వరు లిద్దఱు కూడ దుష్టసంహారమునకే ప్రార్థితులగు చున్నారు.
16. ఉభయులయొక్క పరాక్రమ మపారమనియే వర్ణింపబడెను.
17. మృత్యువును జయించుటయందును (సమానులని యన్వయము).
18. శివుని వాహనభూతమగు 'వృష' శబ్దము వర్షకత్వవ్యుత్పత్తిచే నింద్రవాహన భూతమగు మేఘముకంటె వేఱగుటలేదు.
19. ఆమేఘము వర్షము నిచ్చుటచే సర్వానందకరత్వము గలది యగుచు నంది యనబడెను.
20. తడుపుచున్నందున దానిని 'యుక్ష' యనియు (ఉక్ష=ఎద్దు)
21. జలమును గలిగియున్నందున 'గౌః' అనియు (గౌ=ఎద్దు) పిలచిరి.
22. కనుకనే బాహ్యమునకది నీలవర్ణముగా నగపడుచున్నను, తెల్లని వర్ణము గలదిగా వర్ణింపబడెను.
23. ఉదకములు తెల్లనివే.
24. అట్లైనప్పు డింద్రేశ్వరుల కేల రెండువిధముల వ్యవహారమయ్యెను?
25. ఏలననగా శ్లేష్మప్రాణము రుద్రుడయ్యెను.
26. దాని కధిదైవ మింద్రుడయ్యెను.
27. మధ్యమదైవమున కధ్యాత్మనామము రుద్రుడనియు.
28. అధిదైవికనామ మీశ్వరుడనియు చెప్పుదురు.
29. అందువలన రుద్రాణిని ప్రాణశక్తిగను, దాని కధిదేవతాస్త్రీరూపిణిగా నింద్రాణిని వచించిరి,
30. రుద్రు డింద్రునియొక్క తత్త్వము.
31. ఇంద్రుడు రుద్రాభిమాని(రుద్రుడనబడు ప్రాణతత్త్వమందభిమాని).
32. రుద్రాణి యింద్రాణియను దేవతయొక్క తత్త్వము.
33. ఇంద్రాణి రుద్రాణియందభిమానిని.
34. రుద్రాణీ రుద్రులను యోగు లుపాసింతురు. వారధ్యాత్మోపాసకులు (అనగా నధ్యాత్మపరులు).

35. ఇన్ద్రాగ్నిణీన్ద్రగ్నిశ్చ వైదికైః స్వాధ్యాయేన సంస్తూయేతే తేహ్యాధి
దైవతపరా స్తేహ్యాధిదైవత పరాః ।

---

# సృష్టి సూత్రమ్

1. ఏకః ప్రాణ శరీర ఆత్మాగ్రే సుప్తే రుత్థిత ఐక్షత ।

2. సా ప్రథమేక్షాఽనన్తో దేశః ।
3. ప్రకృతిరేవ న వికృతిః ।
4. శుద్ధా దాకాశా న్నాతిరిచ్యతే ।

5. అంబికా విశ్వజన్మక్షేత్రత్వాత్ ।
6. ఆ ప్రలయం నిర్విరామా న స్తరేక్షాధారా కాలః ।
7. ప్రకృతిరేవ న వికృతిః ।
8. తపోధ్యానాఽవ్యతిరేకాత్ ।

9. మాతరిశ్వా ప్రాణనానన్యత్వాత్ ।

10. ఈక్షతే ధ్యాయతి ప్రాణితీతి న పృథక్రియాః సమష్టౌ ।

11. వ్యష్టౌచ స్థితప్రజ్ఞ దశాయామ్ ।
12. అఖండ ధారాత్వా న్న నానా ।

35. ఇంద్రాణీ యింద్రులను వైదికులు స్వాధ్యాయమందు స్తుతించు చున్నారు. అట్టి వైదికులే యధిదేవతాపరులు, వారే యధిదేవతాపరులు.

---

# సృష్టి సూత్రము

1. ప్రాణమును శరీరముగా గలిగి యేకమైయున్న ఆత్మయే సుషుప్తి నుండి మొదట లేచినదై చూచినదయ్యెను. [మువలన).
2. ఆ మొదటి యీక్షయే యనంతమగు దేశమయ్యెను. (విశాలత్వ
3. అది ప్రకృతియేకాని వికృతికాదు. (ప్రకృతియనగా స్వభావము).
4. శుద్ధాకాశముకంటె వేఱును కాదు. (ఆకాశ నామావళిని బట్టి అదియే శుద్ధాకాశమని భావము.)
5. దానిని విశ్వజన్మకు క్షేత్రమగుటవలన నంబిక యనిరి.
6. ప్రళయాంతమువఱకు నిర్విరామమైయుండు నీ యనంత రేతోధార
7. అదియు ప్రకృతియేకాని వికృతి కాదు. [కాల మనబడెను.
8. తపస్సు ధ్యానముకంటె వ్యతిరేకము కానందునను (ఈక్ష యనినను ఇచ్ఛ యనినను నొక్కటియే. ఏకధారమైన ధ్యానమును తపస్సందురు.)
9. ప్రాణనము (ప్రాణచైతన్యము) మాతరిశ్వుని కంటె (వాయువు కంటె) వేఱుకానందునను (తరువాతసూత్రముతో నన్వయము).
10. చూచుట, ధ్యానించుట, ప్రాణముచే కదలుట (అనగా నీక్ష, తపః, ప్రాణనములు) అనునవి సమష్టియందు వేర్వేఱు క్రియలు కాజాలవు.
11. అట్లే స్థితప్రజ్ఞదశకు జెందిన వ్యష్టియందును నుండును.
12. అఖండధారగలది యగుటచే నీప్రజ్ఞకు — లేదా యీక్షకు — నానాత్వము లేదు.

13. కాలపాకజం ద్రవ్యం తేజో గూఢ వ్యాపక విద్యుద్రూపమ్ ।

14. ప్రకృతిశ్చ వికృతిశ్చ ।

15. తేజః పాకజం ద్రవ్యం ఆపో గూఢ వాపక రసరూపాః ।

16. ప్రకృతిశ్చ వికృతిశ్చ ।
17. అప్పాకజం ద్రవ్యమన్నం గూఢవ్యాపక పృథివీరూపమ్ ।

18. ప్రకృతిశ్చ వికృతిశ్చ ।
19. ఏషా ప్రథమా సృష్టిః ।

20. అథ తేజోఽబన్నానాం పాకవశా దవిభాజ్యః సంశ్లేషః ।

21. ఇయమేవ త్రిగుణాప్రకృతి ర్బాదరాయణస్య ।

22. సర్వస్య దృశ్యస్య మూలసామగ్రీ ।

13. అట్టి యేకధారయనబడు కాలరూప ప్రజ్ఞయొక్క పాకము వలన (కాలమునకు పాచకత్వము సహజస్వభావము, పాచకత్వమునే పరిణామమనిరి) పుట్టిన ద్రవ్యమే నిగూఢముగా వ్యాపించిన విద్యుద్రూపమగు తేజస్సు.

14. అది ప్రకృతియు, వికృతియుకూడ నగుచున్నది. (మూల ప్రకృతిగా నున్న ఆకాశ వాయుతత్వయుతమగు ప్రజ్ఞానమునకును తరువాత వికృతియై పరిణమించిన విశ్వసంబంధమగు విజ్ఞానమునకును నడుమను బుట్టినదియై రెండును నగుచున్నది. కనుక రెండింటియొక్క సంధి సంధానమిది).

15. తేజస్సుయొక్క పాకమువలన పుట్టినద్రవ్యము రసతత్వముచే నిగూఢముగా వ్యాపించిన ఆపోరూపము.

16. అది ప్రకృతియు, వికృతియుకూడ నగుచున్నది.

17. అప్ తత్వముయొక్క పాకమువలన బుట్టిన ద్రవ్యము పృధివీతత్వముచే నిగూఢముగా వ్యాపించిన అన్నరూపము.

18. అది ప్రకృతిగను వికృతిగను కూడ నున్నది.

19. ఇది మొదటిసృష్టి. (పంచభూత సిద్ధాంతములో ఆకాశము, ప్రాణమనబడు వాయువు మూలప్రకృతికి జెందునట్టివనియు, వాని నందువలన శక్తిస్వరూపముగా గైకొనవలెను గాని భూతములుగా గైకొనరాదనియు విశదమగును. కనుక తేజోఽబన్నములనెడి మిగిలిన మూడింటి సృష్టియే మొదటిదనబడెను. ఈ మూడును సూక్ష్మములగు భూతతత్వములగుటచే ప్రకృతిగను, వికృతిగనుకూడ నున్నవి.)

20. కాని తేజోఽబన్నములకు పాకవశముచే నవిభాజ్యమగు సంబంధ (సంశ్లేష) మున్నది.

21. ఇదియే బాదరాయణుడు చెప్పిన త్రిగుణాత్మిక ప్రకృతి (ఆకాశ వాయువులందువలన నిర్గుణప్రకృతికి జెందును).

22. దృశ్యమాన ప్రపంచమునకంతకు త్రిగుణాత్మిక ప్రకృతియే మూలసామగ్రి.

23. ఆత్మా తదన్తరోఽభూత్ ।
24. తమిన్ద్రి మాహుః ప్రాంచః ।
25. ఈశ్వరం నవ్యాః ।
26. ద్వితీయా సృష్టిరేషా ।

27. త్రిగుణాయాః ప్రకృత్యేః పాకవశా దండానా ముద్భవః ।
28. ఆత్మా తేషా మన్తరోఽభూత్ ।
29. తే దేవా ఉచ్యన్తే ।
30. అండేషు పాకవశా త్పిండానా ముద్భవః ।
31. ఆత్మా తేషా మన్తరోఽభూత్ ।
32. తాః ప్రజా ఉచ్యన్తే ।
33. ఇయం తృతీయా వ్యక్త జగత్సృష్టిః వ్యక్త జగత్సృష్టిః ।

---

# రాజయోగసార సూత్రమ్

## ప్రథమః ఖండః

1. ప్రాణో గతిశక్తిమా న్వాయుః ।
2. ఏకత్ర స్థిత ఏవ చలతి తరంగైః ।
3. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసౌ నిభాలయన్గతిశక్తిద్వారోపాసీతవాయుమ్।
4. తతస్తేజశ్శక్తి రుద్రిక్తాస్యాత్ ।

23. దానియంతర మాత్మయయ్యెను. (ఈయంతరమే హృదయము).
24. ఆ యంతరమును పూర్వఋషు లింద్రుడనిరి.
25. నవీను లీశ్వరుడనిరి.
26. ఇది రెండవ సృష్టి. (ప్రవృద్ధిపరమైన త్రిగుణాత్మిక ప్రకృతి యందు నివృత్తగతిని బొందించి యేది యంతరకోశమువలె స్థితమై, యాప్రకృతిని కర్తవలె శాసించుచున్నదో అట్టి యంతరోకోశసృష్టి రెండవది. అధిష్టానమిదియే).
27. త్రిగుణాత్మిక ప్రకృతివలన పాకవశముచే నండసృష్టియయ్యెను.
28. ఆత్మ వానికిని యంతరమయ్యెను. (అనగా కర్తలక్షణమయ్యెను.)
29. ఆత్మవలెనున్న అంతరరూపములు దేవతలనబడెను.
30. అండములందు పాకవశమున పిండములుద్భవించెను,
31. ఆత్మ వానికిని యంతరమయ్యెను.
32. అట్టి పిండరూపముల కంతరరూపులు (జీవులు) ప్రజలనబడు చున్నారు.
33. ఈ మూడవసృష్టియే (27–32 సూ.) వ్యక్తజగత్సృష్టి, యిదియే వ్యక్తజగత్సృష్టి (అనగా—దేవ, పితృ మానవరూపుల సృష్టి, గోళములసృష్టి.)

---

# రాజయోగసార సూత్రము

## మొదటి ఖండము

1. చలనశక్తి గలప్రాణమే వాయువు.
2. అది అనగా వాయు వొక్కచోటనేయుండియు తరంగములచే చలించుచుండును.
3. ఉచ్ఛ్వాస నిశ్వాసములను జూచుటచే దోచు గతిశక్తిద్వారా వాయువు నుపాసించవలెను.
4. దానివలన తేజశ్శక్తి యుద్రిక్తమగును. (చలనమందేకాగ్రత్వమువలన)

5. ప్రాణస్తేజశ్శక్తిమా నింద్రః ।
6. తేజశ్శక్తి రింద్రాణీ ।
7. నాడీష్వసాధారణ మూష్మానుభవం నిభాలయ న్నింద్రాణీ ద్వారోపాసీతేన్ద్రమ్ ।

8. తతః స్వరశక్తి రుద్రిక్తా స్యాత్ ।
9. ప్రాణ స్స్వరశక్తిమాన్ రుద్రః ।
10. స్వరశక్తి ర్గౌరీ ।
11. సూక్ష్మాంతర స్వరం నిభాలయన్ గౌరీద్వారోపాసీత రుద్రమ్।

12. సూక్ష్మాంతర స్వర ఏవ ప్రణవ ఉచ్యతే వేదాన్తేషు ।

13. స బహిశ్చ వ్యాపకః ।
14. రుద్రోపాసనేన క్షేత్రజ్ఞస్య చితిశక్త్యా ప్రతిష్ఠా విన్దేత్పాకే సమాప్తే ।

15. స ఉత్తమః పురుషార్థః ।
16. తస్యాం స్థితౌ నిత్యమప్రయత్నం తపః ।
17. తపసః పాకాద్భవన్తి పూర్వదృఢసంకల్పానురూపాః సిద్ధయః।

18. అవతార పురుషాణాం కార్యానురూపాః ।

5. తేజశ్శక్తివంతమైన ప్రాణమే యింద్రుడు.
6. తేజశ్శక్తియే యింద్రాణి.
7. నాడులయం దసాధారణమైన ఊష్మానుభవమును (అనగా హెచ్చుతగ్గులచే నున్న రక్తోష్ణత గాక ప్రాణప్రవాహజనిత మగు నంతరూష్మముయొక్క యనుభూతిని) జూచుటచే దోచు ఇంద్రాణీద్వారా యింద్రు నుపాసించవలెను.
8. దానివలన (ప్రాణమందు) స్వరశక్తి యుద్రిక్తమగును.
9. స్వరశక్తివంతమగు ప్రాణమే రుద్రుడు.
10. స్వరశక్తియే గౌరి.
11. సూక్ష్మమైన ఆంతర్య స్వరమును గ్రహించుటచే దోచు గౌరీ ద్వారా రుద్రు నుపాసించవలెను.
12. వేదాంతములందు (అనగా నుపనిషత్తులందు) సూక్ష్మమైన యంతస్స్వరమునే ప్రణవ మ్మనిరి.
13. అది బాహ్యమునకును వ్యాపించును.
14. రుద్రోపాసనచే క్షేత్రజ్ఞుని చిచ్ఛక్తియందు నిలకడబొందినప్పుడు పాకము (అంతర్పాకము) సమాప్తమగును. (వాగ్రూపమున బహిర్గతమగు ప్రణవవ్యాపారము నంతర్దృష్టిచే నుపాసించు వారికి రుద్రోపాసనమగుచు క్రమముగా నివృత్తిజెంది యంత ర్ముఖమైన ప్రణవస్వరూపజ్ఞానముచే స్వరచితిశక్తియందు నిలకడ ప్రాప్తించి యంతర్పాకము సమాప్తమగునని భావము. అదియే పూర్ణసిద్ధి.)
15. అది యుత్తమమగు పురుషార్థమగును.
16. అట్టి స్థితియం దప్రయత్నముగా నిత్యము తపస్సగును.
17. తపస్సుయొక్క పాకమువలన పూర్వదృఢసంకల్పవాసనలన్నియు సిద్ధించును.
18. అవతారముబొందిన పురుషులకొఱకట్టి సిద్ధులు తమ కార్యముల కనురూపములగును.

19. నిత్య తపసః సిద్ధయో న బంధాయ ప్రమాదాసంభవాత్ ।

20. ఆద్యాసు తిసృషు తపోభూమిషు తా ఇచ్ఛతో దేవతాను గ్రహాశ్చేత్ ।

21. బంధాయ పునరతపతః ప్రమాద సంభవాత్ ।

## ద్వితీయః ఖండః

22. వ్యాపకశక్తి పక్వానాం భూతానాం సూక్ష్మోరససారః ప్రాణః ।
23. తస్య హృదయ మాయతనమ్ ।
24. తస్యైవ చిత్తాఖ్యా కేషాంచిద్భాషాయామ్ ।

25. తదుపాధిరాత్మా జీవః ।

26. చితిశక్త్యా నిష్ఠయా పరమేశ్వరోఽనుభూయతే. సాహి పర మేశ్వరస్య ప్రాణోపాధేః ।

27. గుణశక్తి కర్మద్వారైవ హి వస్తూనామనుభూతిః ।

19. నిత్యతపస్వికి నిజస్థితినుండి స్ఖలనప్రమాదము సంభవించదు గావున నతని కీ సిద్ధులు బంధముకొఱకు కాజాలవు. (అనగా వాసనలు సిద్ధించినను వానియం దతని యభిమానముండక వాని నిజస్థితి నిష్ఠయందుండును గనుక తిరుగ బంధము బొందడని భావము.)

20. మొదట చెప్పబడిన మూడు తపోభూమికలయందు (అనగా వాయు రింద్ర రుద్రోపాసనలయందు) వాసనాసిద్ధిగోరువానికి దేవతానుగ్రహము గల్గినప్పుడే ప్రాప్తించును.

21. కాని, నిత్యతపస్సు బూననియెడల వాని కా స్థితినుండి స్ఖలనము గల్గి వాని సిద్ధులు మఱల బంధముకొఱకగును.

## రెండవ ఖండము

22. వ్యాపకశక్తివలన పక్వమగు భూతములయొక్క సూక్ష్మరససారమే ప్రాణము.

23. దానికి హృదయమే స్థానము.

24. కొందఱి పరిభాషయందా రసరూప ప్రాణమే చిత్తమనబడు చున్నది. (జీవనాణువనినను చిత్తమాణువనినను అహ్యణువని నను రసనాణువనినను నొక్కటే. అనుభవముయొక్క వ్యాపక రసరూప మిది.)

25. దాని నుపాధిగా గొనిన ఆత్మను జీవుడందురు. (రూపత్వ మొందిన రసోపాధివశమున జీవత్వదశ. అరూపరసమనబడు చిత్తు అనగా మూలరసమునుపాధిగా గొనుట ఆత్మత్వమనిభావము; 'అయితిని' యను నర్థముగల హృదయ మిదియె.)

26. చిచ్ఛక్తియందు నిష్ఠచే పరమేశ్వరు డనుభవింపబడుచున్నాడు; ఆ చిచ్ఛక్తి ప్రాణము నుపాధిగా గొనిన పరమేశ్వరునిదగుట వలన (చిత్తు, శక్తి యభిన్నములు కనుక చిచ్ఛక్తియనబడెను).

27. గుణము, శక్తి, కర్మ అను మూడింటి ద్వారముననే వస్తువుయొక్క అనుభూతి ప్రాప్తించును.

28. ప్రాణశ్చానుభూయతే సాహి ప్రాణస్యపరమేశ్వరానుగృహీతస్య ।

29. ఈశ్వరానుభూతిశ్చాఖండ ప్రకాశవిత్తిః ।
30. ప్రాణానుభూతిశ్చాఖండ రసవిత్తిః ।
31. తదుభయ మవిభాజ్యం లింగం నిష్ఠాయాః ।

## తృతీయః ఖండః

32. ప్రాణస్య ప్రాణాపానవ్యానోదాన సమానాః పంచక్రియా విభూతయః ।
33. ప్రాణస్యోచ్ఛ్వాస నిశ్వాస క్రియావతీ విభూతిః స్వశబ్దేనైవ వ్యవహ్రియతే ।

34. విసర్జన క్రియావ త్యపానః ।
35. చలన క్రియావతీ వ్యానః ।
36. భాషణక్రియావ త్యుదానః ।
37. పచనక్రియావతీ సమానః ।
38. మూలప్రాణస్య శక్తివిశేషా ఏవైతే న ఖండాః ।
39. మూలప్రాణస్య శ్రేష్ఠ ఇత్యపరం నామ ।
40. తస్య ప్రథమా విభూతి రుపాసనేషు ముఖ్యా ।

## చతుర్థః ఖండః

41. ప్రాణస్య క్రియాశక్తిః ప్రత్యుద్గచ్ఛేత్తదేకం తపో యథోక్తమ్।

28. (పైని చెప్పబడిన వానివల్లనే) ప్రాణముకూడ అనుభవింపబడుచున్నది. ఆ యనుభవమగుటయు ప్రాణము పరమేశ్వరానుగృహీతమైనదగుట చేతనే. [జ్ఞానమును.)
29. ఈశ్వరానుభూతియే యఖండ ప్రకాశము నెఱిగించునది (అనగా
30. ప్రాణానుభూతియే యఖండరసము (ఆనందము) నెఱిగించునది.
31. ఆ రెండును నిష్ఠయొక్క యవిభాజ్యలింగములు (అనగా పూర్ణసిద్ధిని సూచించునవి.)

## మూడవ ఖండము

32. ప్రాణమునకు ప్రాణాపానవ్యానోదానసమానము లనబడు నైదును క్రియావిభూతులగును.
33. ఉచ్ఛ్వాస నిశ్శ్వాసక్రియల నొనర్చు ప్రాణవిభూతియు స్వశబ్దమైన ప్రాణమను పదముచేతనే వ్యవహరింపబడుచున్నది. (శక్తిరూప ప్రాణమునకు వృత్తిరూపప్రాణమునకు వ్యత్యాసము తెలియక రెండింటిని ప్రాణమని వ్యవహరించుచున్నారు.)
34. విసర్జనక్రియావతియగు విభూతి నపాన మందురు.
35. చలనక్రియావతియగు విభూతిని వ్యాన మందురు.
36. భాషణక్రియావతియగు విభూతి నుదాన మందురు.
37. పచనక్రియావతియగు విభూతిని సమాన మందురు. [కాజాలవు.
38. మూలప్రాణముయొక్క శక్తి విశేషములైనందున నివి ఖండములు
39. మూలప్రాణమునకు శ్రేష్ఠప్రాణమని యింకొక పేరు.
40. దానియొక్క ప్రథమ విభూతి (అనగా నుచ్ఛ్వాస నిశ్శ్వాస క్రియావతియైన వృత్తిప్రాణము) యుపాసనలందు ముఖ్యము.

## నాల్గవ ఖండము

41. వృత్తిప్రాణము (ప్రథమవిభూతి) యొక్క క్రియాశక్తిని నిరోధించి మూలగతమొనర్చుట—అనగా శక్తిని నిర్విషయమొనర్చుట—పూర్వము చెప్పబడిన ఒకవిధమైన తపస్సగును.

42. ఉదానస్యాన్యత్ ।

43. వ్యానస్యేతరత్ ।

44. భాషణక్రియాయాః సకలక్రియాణాం చోపాసనాభ్యాం తే నాతిరిచ్యేతే ।

45. క్రియోపాసనంచ కుర్వతః క్రియాయా మేవ దృష్టిః ।

పంచమః ఖండః

46. మూలాధారాదాశిర ఏకా సూక్ష్మనాడీ ।

47. సా సుషుమ్నా ।

48. శిరస ఆహృదయం సైవ పునర్లంబతే ।

49. తస్యా అమృతాఖ్యా ।

50. ఏకస్యా ఏవ పశ్చాత్పురశ్చ ద్వౌ మార్గావిత్యేకే ।

51. సుషుమ్నాయాః సవ్యాపసవ్యయో రిడాపింగలే నాసాపుటాన్తగే ।

52. తయోః సవ్యాపసవ్యయో ర్గాంధారీ హస్తిజిహ్వే నేత్రాన్తగే ।

53. అనయోః సవ్యాపసవ్యయోః పూషాలంబుషే శ్రోత్రాన్తగే ।

54. షడపి శిరోవ్యాప్య తతఏవ లంబంతే స్వావసానస్థానపర్యంతమ్ ।

42. ఉదాన మనెడి విభూతి విషయములో శక్త్యుద్గమన మింకొక విధమగు తపస్సగును. (ఈ విభూతి శబ్దసంబంధము గావున మార్గముచ్ఛ్వాస నిశ్శ్వాసములతో చేయు పద్ధతివలె నుండదు.
43. వ్యాన విషయములో తపస్సు మఱియొకవిధము.
44. భాషణముల క్రియోపాసన ఉదానమునకువలె సకలక్రియలకు సంబంధించు నితరోపాసన వ్యానోపాసనకంటె భిన్నము గాకుండును.
45. క్రియోపాసన (మెట్టిదైనను దానిని) జేయువా డా క్రియయందే దృష్టి నుంచవలెను.

## ఐదవ ఖండము

46. మూలాధారము మొదలుకొని శిరస్సువఱకొక సూక్ష్మనాడి యున్నది.
47. అదియే సుషుమ్న.
48. అది శిరస్సునుండి హృదయమునకు తిరుగ వ్రేలాడుచున్నది.
49. వ్రేలాడు భాగమున కమృతనాడి యని పేరు.
50. ఈ నాడియంతయు నొక్కటియే యైనను వెనుకకు కొంతభాగము (సుషుమ్న), ముందునకు కొంతభాగము (అమృత) ఉన్నందున రెండు సాధనమార్గములుగలది యని కొందఱందురు.
51. సుషుమ్నకు (పశ్చాన్నాడికి) కుడి యెడమలం దిడా పింగళము లనబడు రెండు నాడులు నాసాపుటాంతములను బొంది యున్నవి.
52. ఆ రెండింటికి కుడి యెడమలందు గాంధారీ యను నాడి, హస్తిజిహ్వాయను నాడి నేత్రాంతములను బొందియున్నవి.
53. గాంధారీ హస్తిజిహ్వానాడులకు కుడియెడమలుగా పూషానాడి, అలంబుషానాడి శ్రోత్రాంతములను బొందియున్నవి.
54. పై యాఱు నాడులుగా శిరస్సున సుషుమ్న వ్యాపించినను, శిరస్సునుండి వ్రేలాడునప్పు డవి యొక్కటియగుచు నిజావసానస్థాన (అనగా హృదయ) పర్యంతము నుండును.

55. తా ఏతాః సప్తనాడ్యః సప్తజిహ్వా ఆధారవేదిగస్య తేజసః ।

56. సప్తజిహ్వా ఏవ సప్తార్చిషః ।
57. నాభిం నాడీనాం జన్మస్థాన మేకే ।
58. దేహ మధ్యకందస్య తావత్పర్యంతవ్యాప్తేర్భాక్తః స వ్యవహారః ।

59. దేహ మధ్యకందస్య మూలస్థం పర్వ మూలాధారః ।
60. మధ్యస్థం స్వాధిష్ఠానమ్ ।
61. అగ్రస్థం మణిపూరమ్ ।
62. నాడీ తంతుజాల వంశస్య కందాదుపరి చతుర్థం పర్వానాహతం హృదిపశ్చాత్ ।

63. పంచమం విశుద్ధం కంఠే ।
64. షష్ఠ మాజ్ఞాఖ్యం శిరః కుహరే ।

65. అగ్రం సహస్రారమ్ ।
66. అత్ర వంశే సుషుమ్నయా ప్రవహన్తీ మూలాధారస్థ తేజసః శక్తిః కుండలినీ ।
67. తస్యా ఊర్ధ్వముఖ్యా అభిముఖ్యేనాధశ్చింతనం ధ్యానమ్ ।

68. అత్ర నిమీలితనేత్రో గగనాచ్ఛీర్షం ప్రవిశన్తీం శక్తిం ఆదితో భావయేత్ ।
69. తతస్తాం నాడీచక్రే ఉవతరణక్రమేణామూలాధారమ్ ।

70. అథాభ్యాసబలాత్తేజసి ప్రతిష్ఠాం విన్దేత్ ।

55. ఆయీ యేడు నాడులు మూలాధారాగ్ని తేజస్సునకు సప్తజిహ్వా లనబడును.
56. సప్తజిహ్వాలే సప్తార్చిషములు (అనగా సప్తజ్వాలలు.)
57. నాడులకు జన్మస్థానము నాభి యని కొందఱందురు.
58. దేహమధ్యభాగముయొక్క కందము (అనగా వెన్నెముకయొక్క దిగువభాగమున—దుంపవంటిది) నాభిపర్యంతము వ్యాప్తమగు చున్నట్లు చెప్పుట గౌణవ్యవహారము.
59. ఆ కందములో మూలమందున్న కణుపు మూలాధార మనబడును.
60. మధ్యమ కణుపు స్వాధిష్ఠానము.
61. అగ్రమందున్న కణుపు మణిపూరము (నాభిస్థానము.)
62. పిమ్మట నాడీతంతుజాలముతోఁగూడిన వెన్నుదండములో(ఇదియు కణుపులుగలిగి వంశము లేదా వెదురుదండమును బోలియుం డును) కందమునకు పైనియుండు నాల్గవ కణుపు అనాహతమై హృదయ(ఫలక)మునకు వెనుక నున్నది.
63. ఐదవ పర్వము విశుద్ధమై కంఠమందున్నది.
64. ఆఱవది యాజ్ఞ యను పేరుతో శీర్షకుహరమందున్నది (కణుపు లంతవఱకే.)
65. దండముయొక్క యగ్రము సహస్రారము.
66. ఆ దండిలో సుషుమ్నద్వారా ప్రవహించు మూలాధార తేజ శ్శక్తిని కుండలినీ యందురు.
67. ఊర్ధ్వముఖియగు కుండలిని నభిముఖముగా (ఎదురుగా) దిగువకు చింతనజేయుట (యామెయొక్క) ధ్యానమగును.
68. ఆ ధ్యానమందు నిమీలితనేత్రములు గలవాఁడై గగనమునుండి శిరస్సున బ్రవేశించు శక్తిని సాధకుడు మొదట భావించవలెను.
69. పిమ్మట శిరస్సునుండి క్రమముగా నాడీచక్రములం దవతరణమగు శక్తిని మూలాధారపర్యంతము భావించవలెను.
70. అట్లు భావించగా భావించగా నభ్యాసబలమువలన తేజస్సునందు బ్రతిష్ఠ పొందబడును (ఇదియే ప్రాణక్రియ ప్రణవతేజమగుట.)

71. అనన్తరం స్వరచితిశక్తి నిష్ఠా యథా పూర్వమ్ ।

## షష్ఠః ఖండః

72. అమృతయా ప్రవహన్తీ ధీః జ్ఞానశక్తిః ।
73. తాం శిరస్త ఆజ్ఞాచక్ర మవతారయేత్ ।
74. తతో విశుద్ధమ్ ।
75. తతో హృదయస్య దక్షిణతః పురోభాగస్థం దహరమ్ ।

76. తత్ర నిష్ఠా చితిశక్త్యా నిష్ఠాతో నాతిరిచ్యతే ।

77. సోఽయం తపసోఽన్యః ప్రకారః ।

## సప్తమః ఖండః

78. అథాత శ్చతుర్విధోఽన్యః ప్రకారః ।

79. దృష్టిం విషయేభ్యః సమాహృత్య దృగ్దృశ్యయో రన్తరాలే స్థాపయేత్ ।
80. సేయ మాకాశోద్గీథ విద్యా ।
81. అనన్తరం కేవలే ద్రష్టరి ప్రతిష్ఠా మభ్యసేత్ ।

82. కథం పశ్యామీతి తత్ర పథమో విచారః ।

71. పిమ్మట స్వరరూపమగు చిచ్ఛక్తియందు నిష్ఠను (14 సూ॥ లో చెప్పబడిన రుద్రోపాసన) బూర్వము చెప్పబడినట్లే సాధించవలెను.

## ఆఱవ ఖండము

72. అమృతానాడిని బొంది ప్రవహించు బుద్ధిని జ్ఞానశక్తి యందురు.

73. అట్టి జ్ఞానమును శిరస్సునందున్న ఆజ్ఞాచక్రమున కవతరింపజేయవలెను.

74. అందుండి విశుద్ధచక్రమున కవతరింపజేయవలెను.

75. అందుండి హృదయఫలకమునకు దక్షిణముగా ముందువైపున (అనగా రొమ్మువైపున) నుండు దహరమున కవతరింపజేయవలెను.

76. ఆ దహరమందు బొందబడు నిష్ఠ చిచ్ఛక్తియందు నిష్ఠకంటె వేఱుకాదు (ఇది దహరాకాశనిష్ఠ.)

77. ఆ యీ సాధనము తపస్సున కన్యమార్గము. (ఈ విధముగా పశ్చాత్పురోనాడులతో సాధింపబడు విద్యల రెండింటి వివరణము ముగిసెను.)

## ఏడవ ఖండము

78. పిమ్మట నింకొక ప్రకారమున (ఉపనిషత్ప్రకారమున) చతుర్విద్యలు చెప్పబడుచున్నవి.

79. విషయములనుండి దృష్టిని మఱలించి దృగ్దృశ్యములనడుమనుండు నాకాశమందు స్థాపించవలెను. (మొదటివిద్య)

80. ఆ యీ విద్య ఆకాశోద్గీథవిద్య యనబడును.

81. అనంతర మొక్క ద్రష్టయందే దృష్టిని బ్రతిష్ఠించుట కభ్యసించవలెను. (రెండవ విద్య)

82. ఈ యభ్యాసములో 'నెట్లు చూచుచుంటి' ననునది మొదటి విచారణ.

83. కః పశ్యతీతి ద్వితీయః ।
84. ఏషోఽహం పశ్యామీతి నిష్ఠా ।
85. అజ్ఞానినో దర్శనే విషయః ప్రాధాన్యేనావతిష్ఠతే ।
86. ద్రష్టా దర్శనం చాధ్యాహ్రియతే తస్యాః ప్రమితేర్వాక్యత్వే ।
87. యోగినో దర్శనే ద్రష్టుః ప్రాధాన్యమ్ ।
88. విషయో దర్శనం చాధ్యాహ్రియతే తస్యాఃప్రమితేర్వాక్యత్వే।
89. దృష్టావా ప్రతితిష్ఠేత్ ।

90. తస్య దర్శనే దర్శనమేవ ప్రాధాన్యేనావతిష్ఠతే ।
91. విషయో ద్రష్టా చాధ్యాహ్రియతే తస్యాః ప్రమితేర్వాక్యత్వే ।

92. ద్రష్టరి దృష్టావా ప్రతిష్ఠితోఽనంతరం కంఠాయావతరేత్ ।

93. తత్రేన్ద్రియోనౌ ప్రతిష్ఠాం విన్దేత్ ।

94. తతో హృదయాయావతరేత్ ।
95. తత్ర క్షేత్రజ్ఞే క్షేత్రజ్ఞస్య చితిశక్తౌ వా ప్రతిష్ఠాం విన్దేత్ ।

96. తస్యాః స్థితేః పురుషార్థత్వం మాహాభాగ్యంచ ప్రాగ్వత్ ।

అష్టమః ఖండః

97. కేవలో విచారోఽన్యః పన్థాః ।
98. అహం స్ఫూర్తి మూలాన్వేషణ విధయా ।

83. 'చూచుచున్నవాడెవ' డనునది రెండవ విచారణ.
84. 'ఈ నేను చూచుచుంటి' నని నిజద్రష్ట నెఱుగుట నిష్ఠయగును.
85. అజ్ఞానియొక్క దర్శనమందు విషయము ప్రధానమగును.
86. ద్రష్టను, దర్శన కర్మను కూడమఱచుట వాని ముఖ్యలక్షణము.
87. యోగియొక్క దర్శనమందు ద్రష్ట ప్రాధాన్యము.
88. విషయమును, దర్శనకర్మను విడచుట వాని ముఖ్యలక్షణము.
89. (ద్రష్టయందుంచలేనిచో) లక్ష్యమును దృష్టియందైన నుంచవలెను. (ఇది మూడవ విద్య)
90. దానిని జూచుటయందు చూపే ముఖ్యమగును.
91. విషయమును, ద్రష్టను గూడ విడచుట యీ సాధనమందు ముఖ్య లక్షణము.
92. ద్రష్టయందుగాని దృష్టియందుగాని నిలకడదృష్టి బొందినపిమ్మట కంఠమునకు దానిని దించవలెను.
93. అక్కడ యింద్రయోని (అనగా కొండనాలుక—ఉపజిహ్వ) యందు దాని ప్రతిష్ఠ బొందును. (ఇది తైజసపురుషస్థానము)
94. పిమ్మట హృదయమున కాదృష్టిని దించవలెను.
95. అక్కడ క్షేత్రజ్ఞునియందుగాని యతని దృష్టియగు చిచ్ఛక్తి యందుగాని సాధకుడు తనదృష్టియొక్క ప్రతిష్ఠ బొందును. (ద్రష్టలక్ష్యమున్నవాడు క్షేత్రజ్ఞునియందును, దృష్టి లక్ష్యముగా గలవాడు చిచ్ఛక్తియందును బ్రతిష్ఠబొందును.)
96. అట్టి స్థితియే పూర్వము వచింపబడిన పురుషార్థత్వమదియే మహాభాగ్యమని చెప్పదగును.

## ఎ ని మ ద వ ఖ ం డ ము

97. కేవల విచార మింకొక మార్గము. (ఇది నాల్గవవిద్య)
98. 'అహమ్మహ'మ్మను స్ఫూర్తియొక్క మూలము నన్వేషించు విధమువలన.

99. అహం స్ఫూర్త్యా ప్రత్యగ్గత్యావతరణేన వా ।

100. విచారయన్ అనారతం తజ్జేనోష్మణా హృదయస్య నాడీ-
బన్ధం శిథిలయేత్ ।

101. తత్త్వజ్ఞానేనాభిమాన బన్ధమ్ ।

102. అత్రచ నిష్ఠా పురుషార్థ మాహాభాగ్యాని ప్రాగ్వత్ ।

అన్యసూత్ర గ్రంథాష్టకం సమాప్తమ్.

ఇతి శ్రీ భగవన్మహర్షి రమణాంతే వాసినో వాసిష్ఠస్య నరసింహ సూనోః
గణపతేః కృతిరియం మహావిద్యాది సూత్రావళిః సమాప్తా.

---

99. (లేదా) 'అహం' స్ఫూర్తియందు పృథక్చలనమును (నిలుపుటకై) అవతరణ విధమువలన (నిజస్థితి పొందబడునని యధ్యాహార్యము).

100. నిత్యము విచారణచేయుటచే జనించు నాంతర్యవేడిమిచే హృదయమందు నాడీబంధమును శిథిలమొనర్చవలెను.

101. పైని చెప్పబడిన తత్త్వజ్ఞానమువల్లనే యభిమానబంధముకూడ శిథిలము గావింపవలెను. (మనయందు నాడీబంధము, అభిమానము అను రెండే యనర్థములు)

102. ఆ హృదయమందలి నిష్ఠయే పూర్వముచెప్పబడిన పురుషార్థత్వమదియే మాహాభాగ్య మనదగును,

అన్యసూత్ర గ్రంథాష్టకము సమాప్తము.

ఇట్లు శ్రీ భగవన్మహర్షి రమణాంతేవాసియు, వాసిష్ఠగోత్ర నరసింహశాస్త్రి పుత్రుడును అగు గణపతిచే రచింపబడిన మహావిద్యాది సూత్రావళి సమాప్తము.

---

# అ ను బం ధః

## అక్షరావళిః

(రుద్ర నామాని)

శ్లో॥ 1. శ్రీకంఠానన్త సూక్ష్మాఖ్యాం త్రిమూర్తి మమరేశ్వరమ్ ।
అర్ఘీశం భారభూతిం చాతిథీశం స్థాణుకం హరమ్ ॥

2. ఝింటీశం భౌతికం సద్యోజాతం చానుగ్రహేశ్వరమ్ ।
అక్రూరంచ మహాసేనం స్వరరుద్రా న్నమామ్యహమ్ ॥

3. అన్యానోక్రోధీశ చండేశ పంచాన్తక శివోత్తమాన్ ।
ఏక రుద్రంచ కూర్మేశమేకనేత్రం చతుర్ముఖమ్ ॥

4. అజేశం సర్వసోమేశౌ లాంగలీశంచ దారకమ్ ।
అర్ధనారీశ్వరం చోమాకాన్త మాషాఢి దండినౌ ॥

5. అత్రిం మీనేశ మేషేశౌ లోహితం శిఖినం తథా ।
ఛగలాండం ద్విరండేశం మహాకాలంచ వాలినమ్ ॥

6. భుజంగేశ పినాకీశ ఖడ్గీశా న్బక మర్జునమ్ ।
భృగుంచ నకులీశానం శివం సంవర్తకం నుమః ॥

# అక్షరావళి

అక్షర బీజములను సూచించు సంకేత నామావళిని రుద్ర, విష్ణు, శక్తి పరములుగా విభజించిన విధము దిగువపట్టికనుండి యన్వయమగును.

| | రుద్ర నామములు 1-6 శ్లో॥ | విష్ణు నామములు 7-10 శ్లో॥ | శక్తి నామములు 11-16 శ్లో॥ |
|---|---|---|---|
| అచ్చులు (స్వరములు) | | | |
| అ | శ్రీకంఠః | కేశవః | నివృత్తిః |
| ఆ | అనన్తః | నారాయణః | ప్రతిష్ఠా |
| ఇ | సూక్ష్మః | మాధవః | విద్యా |
| ఈ | త్రిమూర్తిః | గోవిన్దః | శాన్తిః |
| ఉ | అమరేశ్వరః | విష్ణుః | ఇన్ధికా |
| ఊ | అర్ఘీశః | మధుసూదనః | దీపికా |
| ఋ | భారభూతిః | త్రివిక్రమః | దేవికా |
| ౠ | అతిథీశః | వామనః | మోచికా |
| ఌ | స్థాణుకః | శ్రీధరః | పరా |
| ౡ | హరః | హృషీకేశః | సూక్ష్మా |
| ఏ | ఝింటీశః | పద్మనాభః | సూక్ష్మామృతా |
| ఐ | భౌతికః | దామోదరః | జ్ఞానామృతా |
| ఓ | సద్యోజాతః | వాసుదేవః | ఆప్యాయినీ |
| ఔ | అనుగ్రహేశ్వరః | సంకర్షణః | వ్యాపినీ |
| అం | అక్రూరః | ప్రద్యుమ్నః | వ్యోమరూపా |
| అః | మహాసేనః | అనిరుద్ధః | అనన్తా |
| హల్లులు | | | |
| క | క్రోధీశః | చక్రీ | సృష్టిః |
| ఖ | చండేశః | గదాయుధః | ఋద్ధిః |
| గ | పంచాన్తకః | శార్ఙ్గీ | స్మృతిః |
| ఘ | శివోత్తమః | ఖడ్గీ | మేధా |
| ఙ | ఏకరుద్రః | శంఖీ | సంజ్ఞా |
| చ | కూర్మేశః | హలాయుధః | కాంచనదేవతా |
| ఛ | ఏకనేత్రః | ముసలీ | ద్యుతిః |

(విష్ణు నామాని)

7. కేశవాద్యనిరుద్ధాన్తాః కీర్తితాః స్వర విష్ణవః ।
చక్రీ గదాయుధః శార్ఙ్గీ ఖడ్గీ శంఖీ హలాయుధః ॥
8. ముసలీ శూల హస్తశ్చ పాశవా నంకుశీ తథా ।
ముకున్దో నన్దజో నన్దో నరో నరకజిద్ధరిః ॥
9. కృష్ణః సత్యః సాత్వతశ్చ శౌరిః శూరో జనార్దనః ।
భూధరో విశ్వమూర్తిశ్చ వైకుంఠః పురుషోత్తమః ॥
10. బలో బలానుజో బాలో వృషఘ్న వృషహాంసకాః ।
వరాహో విమలః పశ్చా న్నృసింహో విష్ణవోహలామ్॥

(శక్తి నామాని)

11. నివృత్తిశ్చ ప్రతిష్ఠాచ విద్యాశాన్తి రథేన్దికా ।
దీపికా దేవికా పశ్చాన్మోచికానన్తరం పరా ॥
12. సూక్ష్మ సూక్ష్మమృతా జ్ఞానామృతా చాప్యాయినీ తతః ।
వ్యాపినీ వ్యోమరూపాచానన్తాస్యుః స్వరశక్తయః ॥
13. సృష్టిశ్చర్ధిః స్మృతిర్మేధా సంజ్ఞా కాంచనదేవతా।
ద్యుతిః స్థిరా స్థితిః సిద్ధి ర్జరా తదనుపాలినీ ॥
14. క్షాన్తి ర్మహేశ్వరీ పశ్చాద్రతి స్తదను కామికా ।
విశాలాక్షీ హ్లాదినీచ ప్రీతి స్తదను నాదినీ ॥
15. తీక్ష్ణ రౌద్రీ భయా నిద్రా తన్ద్రా క్షుత్క్రోధినీ క్రియా ।
ఉత్కారీ మృత్యుసంజ్ఞాచ పీతా తదను సంగతిః ॥
16. అరుణా శ్యామలా వజ్రా స్మృతా వ్యంజనశక్తయః ।
వర్ణానామేవ మీశాన విష్ణు శక్తి స్వరూపతా ॥
17. అత్రవర్ణాః స్వరస్పర్శాన్తః స్థోష్మాణ స్తతః పరమ్ ।
కకారశ్చ క్షకారశ్చే త్యేక పంచాశదీరితాః ॥

| | | | |
|---|---|---|---|
| జ | చతుర్ముఖః | శూలహస్తః | సిరా |
| ఝ | అజేశః | పాశవాన్ | సితిః |
| ఞ | సర్వః | అంకుశీ | సిద్ధిః |
| ట | సోమేశః | ముకుందః | జరా |
| ఠ | లాంగలీశః | నందజః | పాలినీ |
| డ | దారకః | నందః | క్షాంతిః |
| ఢ | అర్ధనారీశ్వరః | నరః | మహేశ్వరీ |
| ణ | ఉమాకాన్తః | నరకజిత్ | రతిః |
| త | ఆషాఢీ | హరిః | కామికా |
| థ | దండీ | కృష్ణః | విశాలాక్షీ |
| ద | అత్రిః | సత్యః | హ్లాదినీ |
| ధ | మీనేశః | సాత్వతః | ప్రీతిః |
| న | మేషేశః | శౌరిః | నాదినీ |
| ప | లోహితః | శూరః | తీక్ష్ణా |
| ఫ | శిఖీ | జనార్దనః | రౌద్రీ |
| బ | ఛగలాండః | భూధరః | భయా |
| భ | ద్విరండేశః | విశ్వమూర్తిః | నిద్రా |
| మ | మహాకాలః | వైకుంఠః | తన్ద్రా |
| య | వాలీ | పురుషోత్తమః | క్షుత్ |
| ర | భుజంగేశః | బలః | క్రోధినీ |
| ల | పినాకీశః | బలానుజః | క్రియా |
| వ | ఖడ్గీశః | బాలః | ఉత్కారీ |
| శ | బకః | వృషఘ్నః | మృత్యుసంజ్ఞా |
| ష | అర్జునః | వృషః | పీతా |
| స | భృగుః | హంసకః | సంగతిః |
| హ | నకులీశానః | వరాహః | అరుణా |
| ళ | శివః | విమలః | శ్యామలా |
| క్ష | సంవర్తకః | నృసింహః | వజ్రా |

17 వ శ్లోకములో మొత్తము 51 అక్షరములని చెప్పబడెను.

(పంచభూతాని)

18. భూతా న్యజగవీ బాలో బలో వాలీ వరాహకః ।

(సప్తధాతవః)

సప్తవాలిన మారభ్య ధాతవః సమ్ప్రకీర్తితాః ॥

(ఇతర నామాని)

19. చన్ద్ర సూర్యౌ సమాఖ్యాతావనుస్వార మకారకౌ ।
గకారశ్చ షకారశ్చ గజానన షడాననౌ ॥

20. స్మృతాః క ల ఇ వా వర్ణా బ్రహ్మేన్ద్ర యమపాశినః ।
కాలః సకారః సంప్రోక్తో హకారః ప్రాణ ఉచ్యతే ॥

21. ఏకార ఉచ్యతే యోని రీకారః కమలోచ్యతే ।
కకారస్తు పునః కామ ఇతి తన్త్రవిదో విదుః ॥

---

ఇతి శ్రీ భగవన్మహర్షి రమణాంతే వాసినో వాసిష్ఠస్య నరసింహ సూనో
ర్గణపతేః కృతిః అక్షరావలీ సమాప్తా.

## పంచ భూతములు

| | అక్షరము | | భూత నామము |
|---|---|---|---|
| 18 శ్లో॥ | ల | అజగవీ | = పృథివీ |
| | వ | బాలః | = ఆప్ |
| | ర | బలః | = తేజః |
| | య | వాలీ | = వాయుః |
| | హ | వరాహకః | = ఆకాశః |

## సప్త ధాతువులు

| అక్షరము | | ధాతు నామము |
|---|---|---|
| య | వాలీ | = త్వక్ |
| ర | భుజంగేశః | = రుధిరమ్ |
| ల | పినాకీశః | = మాంసమ్ |
| వ | ఖడ్గీశః | = మేదః |
| శ | బకః | = అస్థి |
| ష | అర్జునః | = మజ్జా |
| స | భృగుః | = శుక్రమ్ |

## ఇతర నామావళి

| | | |
|---|---|---|
| 19 శ్లో॥ | ం | చన్ద్రః |
| | మ | సూర్యః |
| | గ | గజాననః |
| | ష | షడాననః |
| 20 శ్లో॥ | క్ష | బ్రహ్మా |
| | ల | ఇన్ద్రః |
| | ఇ | యమః |
| | వ | పాశీ |
| | స | కాలః |
| | హ | ప్రాణః |
| 21 శ్లో॥ | ఏ | యోనిః |
| | ఈ | కమలా |
| | క | కామః |

ఇట్లు తంత్రశాస్త్రజ్ఞుల పరిభాష కన్వయము.

[షరా :— విష్ణునామములలో 'సంకర్షణ' తరువాత 'వాసుదేవ' అను క్రమమున్నను, నిక్కడ 'మంత్రమహోదధి'లోని క్రమ మీయబడెను.]

---

ఇట్లు శ్రీ భగవన్మహర్షి రమణాంతేవాసియు, వాసిష్ఠ నరసింహశాస్త్రికి పుత్రుడును అగు గణపతియొక్క కృతియగు అక్షరావళి సమాప్తము.